JAGATI    Rs. 2-00    March 1989

34th Year of Publication

# జగతి

ఎడిటర్: చందూర్

మార్చి – 1989



'బాస్కెట్ బాల్'

—'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జగతి' 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు – 600 004
ఫోన్: 76697 – చందా 2 సం॥లకు రు. 45-00 – 5 సం॥లకు రు. 100-00 జీవిత చందా రు. 300-00. పాట్రన్ – రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: ఉమా మహేశ్వరి

# నిమ్మతొనలు

వ్యాయామ పోటీల గురించి శ్రీనివాసరావుతో ముచ్చటిస్తూ గుర్నాథం అడిగాడు: 'ఈ మధ్య నువ్వు వెయిట్ లిఫ్టింగ్‌లో పాల్గొన్నావు కదా, ఏమొచ్చింది ?'

'నడుంనొప్పి' అన్నాడు గుర్నాథం మెల్లిగా.

—కె నాగేశ్వర్రావు
నరసారావుపేట

పొలం పనుల విషయం ప్రస్తావిస్తూ, "ఏం రామయ్యా, ఎరువులింకా వేయలేదా ? పైరు ఎదగలేదు' అని అడిగాడు భూషణం.

'ఎరువులంటూ వేమిటి - నాలుగు నెలలుగా పెస్టిసైడ్స్ కొడుతున్నాను' - అని చెప్పుకున్నాడు రామయ్య.

—బి జేసుదాసు
కొండపల్లి

రవీ, నేనూ అహల్యా రేపు పెళ్ళి చేసుకోబోతున్నాం - మనకి జాబ్ లేదే, పోషించడమెలాగా అని ఆలోచిస్తున్నాను' - మనసులో మాట చెప్పుకున్నాడు తేజ.

'అహల్యకి కూడా జాబ్ లేదా ?'

'అదే కద యిబ్బంది.'

'మీ మామగారింట్లో వుండిపో కొన్నాళ్లపాటు. కొత్త అల్లుడు పాత బడేదాకా గౌరవంగానే చూస్తారు' - అని సలహా యిచ్చాడు రవి.

'నేనూ మొదట్లో అదే అనుకున్నాను. కాని, మామయ్యగారు తన మామగారింట్లో ఉంటున్నాడే' - అని వాపోయాడు తేజ.

—జి సత్యమూర్తి
వాడ్రేవుపల్లి

సోమవారం నాడు చిదానంద 'ఆ పిక్చర్ మరొక మూడు రోజులు ఆడుతుంది - తప్పకుండా చూడు' - అని చెప్పాడు సదానందంతో.

లక్ష్మీవారం మధ్యాహ్నం సదానందం అన్నాడు : నువ్వు చెప్పిన పిక్చర్‌కి సాయింత్రం వెళ్దామనుకుంటున్నాను - చాలా బావుండి వుండాలి"

'నేను చూస్తే కద బావున్నదీ లేనిదీ చెప్పేందుకు' - అని చిదానందం అనేసరికి విస్తుపోయాడు సదానందం.

—యమ్‌పి వరప్రసాదు
ఇబ్రహింపట్నం

సెక్రట్రీ, ఇవ్వాళ సభకు రెయిన్ కోటు వేసుకు రమ్మంటావా ? - అడిగాడు ప్రజానాయకుడు.

'వొద్దు, సార్, వర్షంపడే సూచనలు లేవు' - అని చెప్పాడు సెక్రట్రీ.

'నువ్వే కాదుటయ్యా యిందాక, ప్రజలు నన్ను అభివందన వర్షంలో తడిపేస్తారన్నావ్!'

—బి వెంకటేశ్వర్లు
రుద్రారం

విూ మేనేజరుగారితో మాట్లాడాలి - అంది చకచకా లోనికి వచ్చిన నీరజ, రిసెప్షనిస్ట్‌తో.

'ఈ టైములో ఆయన ఎవరితోనూ మాట్లాడరు, మేడమ్' - అంది రిసెప్షనిస్ట్ ఎంతో వినయంగా!

'ఆయన మాట్లాడక్కర్లేదు - నేనే మాట్లాడతాను' అని రివ్వున లోనికి వెళ్తున్న నీరజని ఎలా ఆపాలో తెలియక బిత్తరపోయి చూస్తున్న రిసెప్షనిస్ట్‌తో చెప్పాడు అటెండరు: 'ఆమె మన మేనేజరు గారి భార్య'

—వైవి రమణ
చీరాల

విూరెప్పుడూ పేపరు పట్టుకు కూచుంటారు. కాసేపు కబుర్లు చెప్పండి' అంది సునంద గోముగా.

'ఏం చెప్పమంటావు? తీరి కూచుని పోట్లాట వేసుకోవడం కంటె పేపరు చదువుకోవడం మంచిపని కదా' - అన్నాడు భర్త.

'నేనొకటి అడుగుతాను చెబుతారా?'

'అడుగు'

'మీరెప్పుడూ తప్పు చేయలేదా?'

'చేయకేం, చేశాను. పాతికేళ్ల క్రితం నీ మెడలో తాళికట్టి!'

—జి మాధవీరామ్
నందిగామ

నేనడక్కుండా మా ఆయన సినిమాకి వెళదామని అన్నారంటే, అందులో ఏదో 'మెతక' వున్నట్లే! వారి బంధుమిత్రులెవరో మర్నాడు పొద్దుట రైలులో దిగవచ్చు. —భార్య

# పాఠకుల తీర్పు

చందూర్‌గారికి : ఈమధ్య 'డైరీ' లో తాతాప్రకాశంగారి గురించి వ్రాసింది చదివి చాలా సంతోషంతో నవ్వుకున్నాం. ఎందుకంటే అతను మాకు 25 సం॥గా మిత్రులు. అంతే గాక ఎనిమిదేళ్ల క్రితం వారి రెండో అమ్మాయి మా బావగారి కోడలు అయింది. మామధ్య బంధుత్వం కంటె కూడా స్నేహభావాలే ఎక్కువ .... అతను వచ్చాడంటే గంటలుకాదు, రోజులు కూడా నిముషాల్లా అయి పోతాయి మాకు - అంత సరదా మనిషి .... పోయినవారము వీకెండ్‌కి అక్కడికి వెళ్లినప్పుడు, 'జగతి' కాపీ చూపించి "చూశావా. ప్రకాశం, నీ గురించి చందూర్జీ 'డైరీ' లో రాశారంటే, నువ్వు చాలా ఫేమస్ అన్నమాట' - అన్నారు మావారు. ఆయన ఎంత సంతోషపడిపోయారో చెప్పలేను. మా సంతోషం మీకు తెలిపేందుకే ఈ లెటర్.

—శాంతామూర్తి
మిడిల్‌టౌన్ - అమెరికా

మిత్రులు శ్రీ చందూర్‌గారికి ; నమస్కారములు. ఇంటిల్లిపాదిని చదివిస్తున్న 'జగతి' లో, నన్ను ముఖ్యంగా ఆకట్టుకొంటున్నది 'డైరీ'. మీతో పాటు ఉంటూ, ఆయాఘట్టాలు చూస్తూ, పాల్గొంటున్న అనుభూతిని కలిగిస్తున్న మీ రచనాపాటవం అనితర సాధ్యం. wonderful ... 'ప్రాచీన సాహితి', 'వెన్నెల కెరటాలు' చక్కటి ప్రేరణ కలిగిస్తున్నాయి. 'మానవప్రగతి' విజ్ఞానప్రదం. ఇంత రెగ్యులర్‌గా, చక్కగా పత్రికను నడిపించడంలో ఉన్న కష్టసుఖాలు అనుభవైక వేద్యాలు. మీ సాఫల్యానికి మా అభినందనలు. నూతన సంవత్సర శుభాకాంక్షలతో ....

— భీమసేన్ నిర్మల్
హైదరాబాదు-380

గౌరవనీయులు చందూర్ మహాశయులకు హృదయపూర్వక నమస్కారములు. ప్రియసోదరి మాలతిగారికి నా మనఃపూర్వక శుభాకాంక్షలు తెలియ జేస్తున్నాను .... 'జగతి' - 388, అంటే నవంబరుది, ఈరోజే అందింది .... చదివిన వెంటనే ఉత్తరం వ్రాయాలనిపించి వ్రాస్తున్నాను .... ఆగస్టు పదకొండు నుంచి పదిహేను వరకు, విజయవాడలో జరిగిన ఫెస్టివల్, ఉత్సవ విశేషాలూ యివన్నీ చదువుతున్నప్పుడు మనస్సు ఆనందంతో ఉరకలు వేసింది.

—అమ్మాజీ సర్కార్
అల్‌హస్సా - సౌదీ అరేబియా

# ప్రాచీన సాహితి

యతి సంగంబున బాలు డాదరముచే జ్యాభర్త దుర్మంత్రిచే
శ్రుతహానిన్ ద్విజు డన్వయంబు ఖులుచే గ్రూర్తిచే శీలము
ద్ధతిచే మిత్రత చూపులేమి గృషి మద్యప్రాప్తిచే సిగ్గు దు
ర్మతిచే సంపదలన్ నశించు జెడు నర్దంబుల్ ప్రమాదంబునన్

—భర్తృహరి

చక్కెరలో బిప్పి సంగతం బైనట్లు
మొగలి పువ్వును ముండ్లు మొలచినట్లు
మావి పంటికి జీడి మట్టు మీఱినయట్లు
కనకంబునకు గామ కలిగినట్లు
గానఖుముత్తెమునకు గొగ్గి పుట్టినయట్లు
చందమామకు గందు వొందినట్లు
పాలతో దోడు బా త్మేళనం బైనట్లు
గంగ లోపల నాచు కలిగినట్లు
ఘనున కొకనేర మించు కనిగెనేని
గొఱుతగా జూచి యెగ్గెన్ను కొనరు బుధులు
భూనుత విలాస పీఠికాపుర నివాస
కుముద హితకోటి సంకాశ కుక్కుటేశ

—కుక్కుటేశ్వరశతకం

అల్లన నవ్వుచున్ ముని సురాంగన జూచి యెటాడు కొన్ననుం
జెల్లు గదమ్మ నీకు గడు జెల్పుడు నిబ్బరమైన ప్రేమ రా
జిల్లగ నిట్లు వర్తిలుట జేసి మృగేక్షణ, యైన నిట్లురావే
వెల్ల దినం బులున్, సవతి యే గతి గల్గునొ మీదు గంటివే.

—పింగళి సూరన 'కళాపూర్ణోదయం'

# పాత కెళ్ళనాటి పిక్చర్

## బాబూ మూవీస్ వారి 'తేనెమనసులు'

మనసులు ప్రధానంగా చేసి, చిత్ర నిర్మాణానికి పూనుకున్న బాబూ మూవీస్ వారు 'మూగమనసులు' తర్వాత 'తేనెమనసులు' అన్నారు. అయితే, ఈ 'తేనెమనసులు' లో 'తేనె' కంటే పంచదారపాకం ఎక్కువ కనపడుతోంది. కొత్త వా (తా)రలతో ఈ రంగుల చిత్రం తయారయిందే గాని నవ్యతగాని, ప్రగతి మార్గం గాని లేవు. అయితే, ఆర్థిక కారణంగా ఉద్యోగం చేస్తున్న అతివను చులకనగా చూడరాదనీ, వెన్నెలలోని వడ గాడ్పులూ, నవ్వులలోని నిప్పురవ్వలూ చూడగలిగే స్త్రీ యే పురుష ప్రపంచపు మాయాజాలంలో పడకుండా, తన వ్యక్తిత్వం కాపాడుకుంటూ, చుట్టూ వారి కళ్లు తెరిపించగలదనీ - అటువంటి పాత్రనొకటి సృష్టించారు దర్శకులు ఆదుర్తి. భానుమతి అనే కథానాయిక ద్వారా నవయుగనారీ లక్షణాన్ని చూపించారు. ఆ పాత్ర ధరించిన సుకన్య, మేటితారలకు ఏవిధంగానూ తీసిపోని విధంగా తన ప్రతిభ వెల్లడించింది. సుకన్యే కాదు, హీరోకృష్ణ, రామోహన్, సంధ్యారాణి - ఈ చిత్రంలో నటించిన ప్రతి ఒక్కరూ తమ పాత్రని చక్కగా పోషించి, ఆదుర్తి సుబ్బారావు ప్రయత్నానికి విజయం చేకూర్చారు .... పగటి వేషం వేసే భానుమతి (సుకన్య), రాత్రినాటకం నడిపే సీత (సంధ్యారాణి) యిరువురూ, అమెరికా వెళ్లివచ్చినంత మాత్రాన కిందు మీదెరుగని స్థితిలో నున్న చిట్టిబాబుని (రామ్మోహన్), మంచి మార్గానికి తీసుకువచ్చే సత్కార్యంలో ఉండగా, ఈ అంతర్నాటక వివరాలు తెలియని డ్రిలు మాస్టారు బసవరాజు (కృష్ణ) విజృంభిస్తాడు. 'పురుషుడు నేనైపుట్టాలి, ప్రకృతి నీవైరావాలి' అని చిట్టిబాబు భానుమతితో అనడం విని కోపోద్రిక్తుడవుతాడు ; హృదయం గాజుముక్కల్లా పగలగా ఆవేశం ఉరకలు వేస్తుంది .... చిన్ననాటి మిత్రులు విలన్‌కి దేహశుద్ధి చేసిన మీదట, ఆ విలన్‌లో వివేకం కలుగుతుంది - సాఫీగా సరదాగా సాగే ఈ చిత్రం రెండు జంటల సుఖాంత ప్రణయంతో ముగుస్తుంది. సంభాషణలు, ఫొటోగ్రఫీ బావున్నాయి సామాన్య ప్రేక్షకునికి తృప్తి నిచ్చే పిక్చర్.

— యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - మార్చి 1965

వచ్చేనెల :
'చదువుకొన్నభార్య'

# వెన్నెల కెరటాలు

## చిలకమర్తి

చిలకమర్తికి గురజాడ శ్రీరామ మూర్తితో స్నేహమేర్పడింది. ఆయన కాకినాడలో ఉండేవాడు. వీరేశలింగం కన్న ముందే ఆంధ్ర మహాకవుల జీవితములు అనే గ్రంథాన్ని గురజాడ వారు రచించినట్లు చిలకమర్తి వివరించాడు. 1894 లో మద్రాసులో అఖిల భారత కాంగ్రెస్ మహాసభలు జరిగాయి. ఆ సభలకు చిలకమర్తి ప్రేక్షకునిగా హాజరయ్యారు. ఏకాక్రియా ద్వ్యర్థకరీ అన్నట్లు అదేసమయంలో మద్రాసులో గల గొప్ప డాక్టర్లచేత తన కళ్ళు పరీక్షించుకోవడమూ పూర్తి చేసుకున్నాడు. కాని మద్రాసు డాక్టర్లు చిలకమర్తికి సంభవించిన నేత్రవ్యాధి నయమయ్యేది కాదనీ, అది జన్మతః ఏర్పడినదేననీ చెప్పేశారు. ఐనా ఆ మహనీయుడు తన అంధత్వానికి నిరాశ చెందలేదు. నిరంతర గ్రంథ పఠనానికి, గ్రంథరచనకూ సహాయకుని ఏర్పరుచుకుంటూ శతాధిక గ్రంథ నిర్మాతగా చిరకీర్తిమంతుడయ్యాడు. గోదావరి మండల ప్రథమ రాజకీయ మహాసభలో చిలకమర్తి చదివిన పద్యాల నెందరో ప్రశంసించారు. న్యాపతి సుబ్బారావు మిక్కిలి సంతోషించారు. వాటిని గురజాడ వేంకట అప్పారావుగారికి పంపించి, ఆంగ్లానువాదం చేయించి తెప్పించారు.

—సోమసుందర్
'స్రవంతి'లో

## చిన్ననాటి మాట

పన్నుల నిరాకరణ, పల్నాడులో పుల్లరి నిరాకరణ ప్రారంభమయ్యాయి. మా పలనాడు తాలూకాలో గ్రామోద్యోగులు రాజీనామా లివ్వటం పాపయ్య పాలెం ప్రాంతంలో ఉన్న అడవులలో పుల్లరి నిరాకరణ, తాలూకాలో నాయకులుగా ఉన్న గిడుగు నరసింహంగారు, గార్లపాటి హనుమంతరావు, సిరిపురపు వెంకటప్పయ్య మొదలైనవారు అరెస్టు కావడం, మరొకవైపు నిర్మాణ కార్యక్రమంగా ఖద్దరు కార్యక్రమాని కనుకూలంగా "శ్రీ లక్ష్మినారాయణ చేవడుకు చేనేత సహకార సంఘం" ప్రారంభించిన కాశిరాజు అశ్వత్థనారాయణ గారినీ తదితరులు 40 మందినీ అరెస్టు చేయటం జరిగాయి. వారి అరెస్టు తర్వాత ఆ సంఘానికి నన్ను కార్యదర్శిగా నియమించారు. అప్పటి నా వయస్సు 13 సం॥లు దాటి 14 సం॥లు. ఈ ఉద్యమంలో తిరుగుతూ ఉండగా పోలీసులు నన్ను

కూడ అరెస్టు చేశారు. అప్పటికింకా మైనర్లను "బోర్సల్ స్కూల్స్" కు పంపటం ప్రారంభం కాలేదు. అందు చేత మైనరునని నన్ను వదలిపెట్టి వేయటం జరిగింది.

— వావిలాల
'గాంధీక్షేత్రం'లో

## ప్రమాదం

జనసంఖ్యలో ప్రథమ స్థానం ఆక్రమించిన చైనా గూడా ఈరోజు జపాన్ తదితర దేశాల సరళిలో జనాభా పెరుగుదలను విజయవంతంగా అదుపుచేయడానికి ప్రయత్నించడం గమనార్హమయిన అంశం. ఆగ్నేయాసియా, భారత ఉపఖండం, లాటిన్ అమెరికా, పశ్చిమ ఆసియా, ఆఫ్రికా జనాభా విపరీతమైన పెరుగుదలకు ప్రధాన కేంద్రాలుగా కన్పిస్తున్నాయి. ప్రపంచ జనాభా పెరుగుదల పరిశోధనల పరిణామక్రమాన్ని ఈ సందర్భాన గమనించాలి. 1930 సంవత్సరంలో ప్రపంచ జనాభా రెండు వంద కోట్లు మాత్రమే. అదనంగా నిమిషానికి 150 మంది చొప్పున రోజుకు 2 లక్షల 20 వేలమంది చొప్పున, సంవత్సరానికి 8 కోట్ల మంది చొప్పున, ప్రపంచ జనాభా పెరుగుతూ వచ్చింది. 1930 తరువాత 30 సంవత్సరాల కాలంలో అనగా 1960 నాటికి ప్రపంచ జనాభా మూడు వందల కోట్లను హెచ్చింది. జనాభా పెరిగితే సమస్యలు మరింత క్లిష్టమవుతాయని సంపన్న దేశాలు గుర్తించాయి. ఈ సత్యాన్ని పేద దేశాలు సరిగా గుర్తించలేదు. తత్ఫలితంగా 1974 నాటికి ప్రపంచ జనాభా నాలుగు వందల కోట్లు క్రీ. శ. 2 వేల సంవత్సరం నాటికి ప్రపంచమంతటా 620 కోట్ల జనాభా వుంటుందని నిపుణులు అంచనా.

— డి ప్రభాకరరావు
'యోజన'లో

# మానవ ప్రగతి

## తరుణ్‌కి 'స్పేస్‌సూట్'

పుట్టుకతోనే సంక్రమించిన ఒక శారీరక లోపంగల నాలుగు సంవత్సరాల భారతీయ బాలునికి అమెరికాలోని ఒక సంస్థ అందజేసిన సహాయంతో నూతన జీవితం లభించినట్టయింది. జలంధర్‌కి చెందిన తరుణ్ ప్రీత్ అరోరా అనే బాలుడు పుట్టుకతోనే తన శరీరంలో స్వేద గ్రంథులు లేకుండా జన్మించాడు. 'హైపో హైడ్రాటిక్ ఎక్టోడెర్మల్ డిస్ప్లాసియా' (హెచ్ ఇడి) అనే ఈ అరుదైన శారీరక లోపం వల్ల తరుణ్‌కి మానవ దేహాన్ని చల్లబరిచేందుకు స్వేద గ్రంథుల రూపంలో సంక్రమించే సహజ సిద్ధమైన 'శీతలీకరణ' లేకుండా పోయింది. కాగా, తరుణ్ దేహంలోని ఈ లోపాన్ని సవరించిచేందుకొక అమెరికన్ సంస్థ ఇటీవల అతడికి ఒక 'స్పేస్ సూట్' ని సమకూర్చింది. అంతరిక్ష యాత్రికులు తమ శరీరాన్ని చల్లగా వుంచుకొనేందుకై ఇటి 'స్పేస్‌సూట్' లనే వాడుతుంటారు. 'హెచ్. ఇ. డి. ఫౌండేషన్' సభ్యుడు, అమెరికా వ్యోమ, వైమానిక సంస్థ (నాసా) 'పబ్లిక్ అఫయిర్స్' అధికారి అయిన కీత్ హెన్రీ ఇటీవల న్యూఢిల్లీలో తరుణ్ ప్రీత్‌కి ఈ 'సూట్' ని అందజేశారు. ఈ సూట్ ఒక హెల్మెట్‌ని, తరుణ్ ప్రీత్ దుస్తుల క్రింద ఇమిడిపోగల ఒక 'వెస్ట్' ని కలిగి వుంటుంది. ఇందులో .... బ్యాటరితో పనిచేసే ఒక చిన్న 'రెఫ్రిజిరేటర్' నుంచి చల్లబడిన 'యాంటీ ఫ్రిజ్ సొల్యూషన్' చిన్న చిన్న ట్యూబుల ద్వారా 'వెస్ట్'కి హెల్మెట్‌కి చేరుకుంటుంది. వ్యక్తి శరీరంలో చేరుకునే ఉష్ణోగ్రతలో 40 నుంచి 60 శాతాన్ని తొలగించడానికి, అదే సమయంలో హృదయ స్పందనను కూడా తగ్గించడానికి వీలుగా ఈ 'శీతలీకరణ వ్యవస్థ' ను రూపొందించారు. 'చికిత్సకు లొంగని లోపం' నుంచి తమ కుమారునికి ఈ 'స్పేస్ సూట్' ఎంతగానో ఉపశమనాన్ని కలుగజేస్తుందని తరుణ్ ప్రీత్ తల్లిదండ్రులు పేర్కొన్నారు. వేసవి కాలంలో అతడు తన శరీరాన్ని చల్లబరుచుకునేందుకె లెక్క లేనన్నిసార్లు స్నానం చేయవలసి వచ్చేదని, వేసవి కాలం తరుణ్‌కి పీడకలలా వుండేదని, అయితే ఇప్పుడు లభించిన 'స్పేస్

సూట్' వల్ల అతడు సాధారణ జీవితం గడపగలడని తాము విశ్వసిస్తున్నామని వారు చెప్పారు. ఈ 'కూలింగ్ సూట్' ని కనిపెట్టక పూర్వం 'హెచ్. ఇ. డి.' తో బాధపడేవారికి రెండే రెండు ప్రత్యామ్నాయా లుండేవి. అవి : శీతల వాతావరణంలో జీవించడం, లేదా ఎయిర్‌కండిషన్ గదుల్లో కాలం గడపడం. ఈ శారీరక లోపంతో జన్మించిన వారికి అదుకునేందుకై ఏర్పడిన 'హెచ్. ఇ. డి. ఫౌండేషన్' వర్జీనియాలోని హాంప్టన్ లో నెలకొని వుంది. లాభాపేక్ష రహితమైన ఈ ప్రయివేట్ సంస్థను సారా మూడో అనే మహిళ గత ఏడాది స్థాపించారు.

## మహానగర్

1987 నాటి లెక్కల ప్రకారం, సోవియట్ యూనియన్ జనాభాలో అత్యధికులు - 18 కోట్ల 60 లక్షల మంది నగరవాసులే! అభివృద్ధి చెందిన దేశాలన్నింటా కనిపించే పరిస్థితే ఇది. 1970-79 సంవత్సరాల మధ్యకాలంలో పట్టణవాసుల సంఖ్య 20 శాతం పెరిగిందని లెక్కలు చూస్తే తెలుస్తుంది. లక్షమందికి తక్కువ జనసంఖ్యతో వున్న పట్టణాల్లో జనాభా పెరుగుదల 9 శాతం మాత్రమే. లక్ష - అయిదు లక్షల మధ్యన జనసంఖ్యతో ఉండే పట్టణాల్లో 23 శాతం జనాభా పెరుగుదల నమోదయింది. అయిదు లక్షలకు మించిన జనాభా ఉండే నగరాల్లో జనసంఖ్య పెరుగుదల 35 శాతం ఉన్నట్లు తేలింది. మహానగరాల్లో జనసంఖ్య విపరీతంగా పెరగడాన్ని సోవియట్ ప్రభుత్వం ప్రోత్సహించలేదు సరిగదా పెరుగుదలని అరికట్టవలసిందిగా ఎన్నో శాసనాలు చేస్తుంది కానీ ఫలితం మాత్రం శూన్యం.... ఇక పౌరుల విషయానికి వస్తే, మహానగరాల్లో ఉండే సామాజిక సౌకర్యాల దృష్ట్యా అత్యధికులు నగరాలనే ఎన్నుకుంటున్నారు. అంటే, మహానగరాల్లో, వృత్తిపరంగా విస్తృతమైన ఎంపిక స్వేచ్ఛ ఉంటుంది. విరామ సమయాలను గడపడానికి అనేక మార్గాలూ అనేక ప్రదేశాలూ నగరాల్లోనే ఉంటాయి. పల్లెటూళ్లలో ఉండే కట్టుబాట్లు నగరాల్లో ఉండవు. అదుపుచేసే నిమిత్తం, మహానగరాల్లో నివాసానికి సంబంధించిన పర్మిట్లు యివ్వడం మీద ఆంక్షలు విధించారు. అయితే యిలాంటి చర్యలు, పట్టణాలకు తరలివచ్చే గ్రామీణ జనాభాను నిరుత్సాహపరచలేదు. చిన్న చిన్న పట్టణాల్లోని కార్మికులను తీసుకోవడం పట్ల ఫ్యాక్టరీ మేనేజర్లు ఆసక్తి చూపిస్తున్నారని ఆర్థికవేత్తలు విమర్శిస్తున్నారు. అనేకమంది సామాజిక శాస్త్రజ్ఞులూ ఆర్థికవేత్తలూ ఏమంటారంటే, ఏ నగరానికి అయినా జనాభాపరంగా పరిమిత సామర్థ్యం మాత్రమే ఉంటుందని. నగరాల నుంచి చిన్న పట్టణాలకు తరలించడంతో తీరదు. గ్రామీణ ప్రాంతాల్లో కూడా మహానగరాల్లో మాదిరే సాంస్కృతిక సామాజిక

సౌకర్యాలు కల్పించేందుకూ ఆ ప్రాంతాల్లోని జీవన ప్రమాణాలను కూడా మహానగరాల స్థాయికి పెంచేందుకూ ప్రయత్నాలు చేస్తున్నారు.

## అంజయ్య

"ఈరోజు నాభార్యా పిల్లలకు రెండుపూట్ల తిండి పెట్టగలుగుతున్నానంటే అదంతా ప్రభుత్వంవారి దయే" అంటాడు ప్రకాశం జిల్లా ఓలేటి వారి పాలెం గ్రామానికి చెందిన 35 సం॥ల అంజయ్య. పుట్టుకతో కుమ్మరి కులస్తుడైనప్పటికీ అతను ఎన్నడూ తన జీవనోపాధి కోసం కులవృత్తిపై ఆధారపడలేదు. కుటుంబంలోని వారందరూ సూర్యచంద్రుల గమనాలు తెలియనంతగా వ్యవసాయ కూలీలుగా ఒళ్లొంచి పని చేసేవారు. ఒకానొక శుభోదయాన విలేజీ డెవలప్‌మెంట్ ఆఫీసరు అంజయ్యను కలుసుకుని క్షేమసమాచారములు అడుగ, అంజయ్య తన ఇబ్బందున్నీ ఆయన ముందు వెళ్ళబోసుకున్నాడు. సిమెంట్‌తో నీటి తొట్టెలు, కాంక్రీటు కిటికీలు మొదలైన వాటినీ తయారు చేయమని సలహా యిచ్చాడు. చిన్న మొత్తంతో అంజయ్య ఒక్కొక్క నీటి తొట్టి తయారీకి రూ. 40/- నుండి 60/- ల వరకు ఖర్చు చేసి నెలకు 50 తొట్ల వరకూ తయారు చేయడం ప్రారంభించాడు. ప్రతి తొట్టిపైన రూ. 10/- నుండి రూ. 15/- వరకు ఖర్చులు పోను మిగిలేది. ఈ విధంగా నెలకు రూ. 600/- నుండి 700/- ల వరకు మిగిలేది. ఈ నీటి తొట్టెలకు మంచి గిరాకీ ఉండేది. అయితే కాంక్రీట్ కిటికీలను మాత్రం ఎవరైనా అడిగితేనే చేసేవాడు. నెలకు రూ. 270/- ల చొ॥న చెల్లిస్తూ తన ఋణాన్ని పూర్తిగా తీర్చివేసి మరల రూ. 500/- సబ్సిడీతో కూడిన రూ. 600/- మొత్తాన్ని సిమెంటు, అచ్చులు కొనడం కోసరా ఋణాంగా తీసుకున్నాడు. అంజయ్య యిప్పుడు తన గ్రామానికి ఒక వణిక్ ప్రముఖుడయాడు.

---

## నెహ్రూవాణి

పరిశ్రమాభివృద్ధి ప్రదానం - ఉక్కు పరిశ్రమ యిత్యాదులు. పారిశ్రామిక రంగం పురోగమించాలని అంటున్నాను. కాని, ఏ పరిశ్రమ అయినా, వ్యవసాయరంగం తర్వాతనే అని నొక్కి చెబుతున్నాను.

1963 జూలై 27

---

మన వ్యక్తిగత జీవితంలో యితరులతో ఏమాత్రం ప్రమేయం లేనిది వివాహం. కాని, ఈ వివాహం విషయంలోనే ప్రతివాళ్లూ వచ్చి మనకు సలహాలు చెప్పి బాగుంచేదామనుకుంటారు.

సెల్లాన్

దేశాన్ని మట్టుకే ప్రేమించేవాడు మరింక దేనినీ ప్రేమించలేడు.

— బెర

# స్వాతంత్ర్యపత్రం



అమెరికాలోని పదమూడు వలసల ప్రతినిధులూ స్వాతంత్ర్య తీర్మానాన్ని వోటింగుకి పెట్టనున్నారు. విన్నపాల రోజులు వెళ్లిపోయాయి. రక్తాభిషేకంతో తప్ప స్వాతంత్ర్యం సిద్ధించని పక్షంలో అందుకూసిద్ధమవుతున్నారు ప్రతినిధులు. వోటింగు వేళకి అందుకునేందుకు సీజర్ రోడ్నీ బయలుదేరాడు....

ఇక చదవండి

"భగవంతుడు నిన్ను వేళక్కు చేర్చి కాపాడుతాడు" - రోడ్నీ శ్రేయస్సు కోరుతూ సోదరుడు చెప్పాడు. 'జాగ్రత్త' అంటూ మెల్లగా ప్రేమగా పల్కింది మేరీ. గుర్రంపై కూర్చున్న విప్లవ వీరుడు కటిక చీకటిలో ఒక్క దౌడు తీశాడు.

## జులై రెండు

మంగళవారము వుదయము మబ్బులతో తెల్లవారినా, వాతావరణం కడు బీభత్సంగా వున్నా, జాన్ యాడమ్స్ మాత్రము విశ్వాసముతో ముందుకు చూస్తున్నాడు. ఇటో అటో తేలవలసిన సమయము ఆసన్నమయింది. హెన్రీ లీ తీర్మానములో కాన్ఫెడరేషన్ – ఏలయెన్సెస్ - ఇవి రెండూ విజయానికి ముఖ్యాంశాలు. కాని అన్నిటికన్నా ప్రథమంగా పేర్కొనవలసినది స్వాతంత్ర్యము. మిసెస్ యార్డ్ వసతి గృహం నుంచి బయలుదేరబోయే ముందు యాడమ్స్, బరన్ అనే మంగలిని కాసేపు కబుర్లు చెప్పనిచ్చాడు. ఈ బరన్, కాంగ్రెస్ మండలిలోని ఇతర పెద్దలతో కూడా మాట్లాడి వున్నవాడు. కుర్చీలో కొంచెము వెనక్కి ఆనుకొని కూచున్నాడు యాడమ్స్. ఒక తెల్లబట్ట తన భుజాల మీదుగా కప్పి, క్షురకర్మ ప్రారంభించబోయాడు. "అబ్బాయ్, ఇవ్వాళ కబుర్లేమిటి? ప్రచారంలో వున్న పెద్ద అబద్ధమేమిటి?"

మంగలికత్తిని తోలు పటకాపై నూరుతూ మాటకారైన బరన్ అన్నాడు: "అంతా అనుకోని నిరుత్సాహాలు."

"నిరుత్సాహం ఎవరికి?"

"నేను సెయింట్ జార్జి క్లబ్ వాణ్ణి కాని అక్కడ మా సమావేశాలు వీలిపోయాయి, కలిసి మాట్లాడుకోవడం భుజించడం మానివేశాము. మాలో ఒక శాఖ రాజుగారి ఆయురారోగ్యాన్ని కోరుతుంది. మరొక శాఖ స్వాతంత్ర్యాన్ని కాంక్షిస్తుంది. ఏ శాఖకు చెందని మధ్యరకం వాళ్లు మూడవ శాఖ, మూడు శాఖలూ విడిపోవడానికి నిశ్చయించుకున్నాయి. ఒకరు పట్నము

లిదివ వెళ్లిపోతున్నారు. ఏ శాఖకీ చెందని మూడోరకంహారు సిటీ టావ రిన్‌లో కలుసుకుంటున్నారు - నావంటి వాళ్ళు. బంచ్ ఆఫ్ గ్రేప్స్ - అను ఫల హారశాలలో సమావేశమవుతున్నాము."

"బాగుంది - కొంచెము తొందరగా తెముల్చు" అన్నాడు యాడమ్స్ తన గడియారము చూసుకుంటూ. ప్రభుత్వ భవనానికి, అడుగులో అడుగు వేసు కుంటూ వెళ్తూ, తన ఆలోచనలలో నిమగ్నుడయాడు యాడమ్స్. సమ స్యలూ ఆందోళనలూ మధ్య ఎబిగైల్ గురించిన తలంపు మనసులో మెదులు తూనే వుంది. తన భార్యాపిల్లలు ఎలా వున్నారో, ఎటువంటి యిక్కట్టులకు లోనవుతున్నారో? ఈ ప్రతినిధులని ఒక అంగీకారానికి తీసుకురాగలిగితే, తను ఈ పోరాట స్థలాన్ని వదిలి సుఖముగా ఇంటిదారి పట్టవచ్చు. సంవత్సరము బట్టీ తను ప్రతిరోజూ అవసర కార్య క్రమావళిని ఆచరణలో పెట్టమని కోరు తున్నాడు. ప్రతినిధులలో చాలామంది క్రమానుబద్ధముగా ఆలోచించడంలేదు. ఏమైనాసరే ఎదిరించాలనే వారు కొందరూ, భీరువులై వెనుకాడే వారు మరి కొందరూ, అయిదుగురు సభ్యుల కమిటీ స్వాతంత్ర్య పత్రాన్ని నిర్మించా లని మూడువారాల క్రితము అను కున్నప్పుడు, ఒక సభ్యునిగా ఎన్ను కున్నారు యాడమ్స్‌ని. ఒకానొక వైదేశిక శక్తితో సంధి సమాఖ్యను ఏర్పరచుకునే నిమిత్తం కమిటీకి ఇతనిని అధ్యక్షునిగా చేశారు. నూతనముగా నిర్మింపబడ్డ యుద్ధ శాఖకు యితను అధ్యక్షుడు. ఇవిగాక సంయుక్త రాష్ట్రాల నిర్మాణ సూత్రాలు రచించే నిమిత్తము మరొక కమిటీ ఏర్పడింది. ఈ కాన్‌ఫెడరేషన్ సూత్రాలే స్వా తం త్ర్యా వ త ర ణా నంతరము రాజ్యాంగ సూత్రాలు అవుతాయి. ఈ సందర్భంలో యాడమ్స్ సుమారు యాభై దేశాల రాజ్యాంగ విధానాలను పఠించాడు. ప్రాచీన గ్రీకులూ రోమన్‌లూ అచ రించిన పద్ధతుల నుంచి అధునాతనంగా డచ్‌వారూ, స్విస్‌వారూ అవలంబించే రాజ్యాంగ విధానాలదాకా సమస్తం సాంగోపాంగంగా పరిశీలిస్తున్నాడు.

"ఇందులో అనేక రాజ్యాంగ విధా నాలు• కొందరు నాయకులు ఆదరా బాదరా ఏర్పాటు చేసిన పాలనా సూత్రాలుగా కనిపిస్తున్నాయి. ఈ దేశంలో మేధావంతులైన ప్రజ లున్నారు. ఉత్సాహమూ ఆసక్తిగల ప్రజలున్నారు, ఆ ప్రజానీకపు అభి ప్రాయ ప్రకారము మన రాజ్యాంగ ప్రణాళిక రూపొందాలి ; ప్రజలే అధి కార నిర్ణేతలు. ప్రజాబలం నుంచే ప్రభుత్వ యంత్రానికి శక్తి వుద్భని స్తుంది" అన్నాడు యాడమ్స్. అతని సహచరులలో చాలా మందికి ఇది ప్రమాదభరితమైన నూతన సిద్ధాంతము వలె తోచింది. ఇక్కడ సమావేశమైన ప్రతినిధిలే ఏకీభావము కనబరచ లేకుండా వున్నారే, అటువంటప్పుడు పదమూడు వేరు వేరు రాష్ట్రాలకి చెంది ప్రజలుగాని ప్రాంతీయ సభలు గాని ఏ రీతిని ఐక్యతాభావానికి

రాగలరు ? ఏ న్యాయవిధాన సూత్రాల ద్వారా వారిని ఒక తాటిపై నడిపించడం సాధ్యమవుతుంది ?

సమావేశ మందిరంలోని ప్రతినిధులందరూ, అధ్యక్షుడైన హంకాక్ కోసం ఎదురు చూస్తున్నారు. ఒక గ్రూప్ మరొక గ్రూప్‌ని అంచనా కడ్తోంది. న్యూయార్క్ రేవు వద్దకు శత్రునౌకా బలం వచ్చిందన్న వార్త మరింత ఆందోళనకరంగా వుంది. ఉత్తర దిశ నుంచి జనరల్ బర్గానీ, కెనడా ద్వారా కొత్త సైనిక పటాలాలను పంపుతున్నాడు. బెనిడిక్ట ఆర్నాల్డ్ సేనలు కడుదీనంగా వెనక్కి మళ్లుతున్నాయి. దక్షిణాన ఛార్లెస్టన్ పట్నము ఫిరంగి దెబ్బలకు గురి అయింది. శత్రువు ఏజంట్లు షెరోకీలో తిరుగుబాటు లేవనెత్తారని పుకార్లు చెలరేగాయి. డన్‌మోర్ ప్రభువు నీగ్రోలని తమ సేనలో చేరమని కొత్త యెత్తు వేస్తున్నాడు. శత్రుదాడులకు మధ్య రాష్ట్రాలు గురి అవుతాయి.

ప్రతినిధులలో కొందరు భయ సంతాపానికి లోనవుతున్నారు. మరి కొందరు సహనము కోల్పోయి చికాకు పడుతున్నారు. ఈ వివాద గ్రస్తమైన తీర్మానముపై తాము ఎటు వోటు చెయ్యాలో తెలియక తికమక పడుతున్నారు ప్రతినిధులు.

"మేము ఏం చెయ్యాలి? శతృదాడికి గురి అవుతున్నది యిప్పట్లో మేమొక్కళ్ళమే ! నగర ముఖ ద్వారాన భీకర నాలుక తెరుచుకు సిద్ధముగా వున్నాడు. కిరాత శత్రువు. స్వాతంత్ర్యము ప్రకటించామా మా కష్టపరంపర అధికతరమవుతుంది" అన్నాడు జాన్ ఆల్సాప్ విచారపడనంతో. "ఆ దాడి గనక నిజముగా జరిగితే మనము వేసే ప్రతి పనీ - స్వాతంత్ర్య తీర్మానాన్ని బలపరచినట్లే అవుతుంది కదా"-అన్నాడు జార్జి క్లిన్‌టగ్.

"మీరు చేసే ప్రతి కార్యమూ మిమ్మల్నీ మీ ప్రజలనేగాక మా రాష్ట్రాన్నికూడా కట్టివేస్తుంది" అన్నాడు హెన్రీ విజ్నర్.

అదేమందిరములో మరొక మూల కూచునివున్న దక్షిణ ప్రతినిధుల సందేహాలు మరొక విధముగా వున్నాయి.

"మనమే గనక స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదిస్తే న్యూయార్క్ మన నుంచి విడిపోతుంది ; పేన్సిల్‌వేనియా కూడా విడిపోవచ్చు" అన్నాడు బ్రాక్‌స్టన్ చుట్టముట్టిస్తూ.

"ఆ మాదిరి విభజన మనని దుర్బలులని చేస్తుంది. అప్పుడు బయట దేశాలేమీ మనకు సహాయం చేయవు" అన్నాడు హారిసన్. "ఇతరులు మనకు సహాయము చేయనీ, చేయకపోనీ నా దృష్టికి ఏది సమంజసమని తోస్తుందో ఆ ప్రకారము చేస్తాను. దక్షిణ కెరోలినా రాష్ట్రము స్వాతంత్ర్య తీర్మానానికి విముఖురాలు. కాని అందరూ తీర్మానాన్ని బలపరుస్తూ వోటు చేస్తే మేమూ అంగీకారము తెలుపుతాము. ఎందుచేతనంటే, అందరమూ కలిసి ఒక మాటమీద వుండాలిగనక" - అన్నాడు రట్లెజ్. "స్వాతంత్ర్యమంటూ ఒక కొత్త గొడవ తెచ్చిపెట్టబోయే

ముందు మన మందరమూ ఒక సమాఖ్యగా ఏర్పడాలి" అన్నాడు బ్రాక్‌స్టన్. "ఆ సమాఖ్యకుగాను సూత్రాలు రాయడమైపోయింది - ప్రతినిధులు వాటిని పరిశీలించడమే తరువాయి" అన్నాడు హారిసన్.

"నేను వాటిని పరిశీలించాను, ఆ భాష మార్చి, బాగా సవరణలు చేస్తే తప్ప, అవి ఆమోదాన్ని పొందలేవు. నలుగురి కోసం మనము కష్టబడాలని, సాముదాయిక క్షేమము కోసము స్వార్థాన్ని కొంత తగ్గించుకోవాలని చెప్పడములోని పర్యవసానము, తూర్పు రాష్ట్రాల చెప్పుచేతల్లో మిగతా రాష్ట్రాలు నడుచుకోవాలనిఆదేశించడం వలె కాకూడదు. ఆ సూత్రాలు ఎంత శ్రద్ధగా చదివినా నాకు అంతకుమించి ఏమీ కనపడలేదు. అందుకనే దక్షిణ కెరోలినా, కేంద్రానికి ఎంత అధికారమివ్వడం సబబో అంతదాకా యిచ్చి. ఆపైన ఆగమంటోంది: మనము సమాఖ్యగా ఏర్పడటము తటస్థిస్తే, సర్వ స్వతంత్ర రాష్ట్రాలుగా బయట ప్రపంచంతో వర్తక వ్యాపారాలు జరుపుకునే హక్కు కావాలి" - అన్నాడు రట్లెజ్. కాంగ్రెస్‌లలోగల విభజనలే పదమూడు రాష్ట్రాలలోని ముప్పైలక్షల ప్రజలలోగల విభేదాలు. ఈ ప్రతినిధులలో చాలా మంది ప్రాంతీయాభిమానము తీవ్రముగా గలవారు. వారి తాతముత్తాతలు, అడవులు నరికించి పట్నాలు కట్టించారు. చర్చిగోపురాలూ రేవు మార్గాలూ వ్యవసాయ క్షేత్రాలు యివన్నీ స్వజన కృషితో నిర్మితమవ

డమువల్ల ప్రాంతీయాభిమానము మెండుగా వుండేది. ఆయావలసలలో తిరిగి తరతమ భేదాలుండేవి. చిన్న కారురైతులూ, యంత్రనిపుణులూ వణిజులూ, భూఖామందులూ, ధని కులూ, సరిహద్దువీరులూ, సంప్రదాయ జీవనులూ, ఇలా రకరకాల కోవలకు చెంది వుండేవారు. ఇంతేగాక ఇతర కారణాలవల్ల కూడా కలహాలు చెల రేగేవి. వంచకులూ, ధర్మపన్నాలు చెప్పే దుష్టులూ, ద్రోహులూ, అని నిందించేవారు బోస్టన్‌లోని వర్తకులని ప్రెసిబిటీరియన్లని ! క్వేకర్లు పనికిమాలిన వారు అనేవారు. కృతఘ్నులూ, కుటి లలూ, అని పేర్కొనేవారు కనెక్టికట్ వాసులని. ఇక దక్షిణ రాష్ట్రాలవారు వచ్చి మోసగాళ్ళూ. జూదగాళ్ళూ నీతి బాహ్యులూ గుర్రప్పందాలూ, తాగుడూ తప్ప ఏమీ తెలియదని నిందా వాక్యాలు పలికేవారు.

వక్రబుద్ధి గల క్వేకర్లు మురా ఇది - అని మెసాచుసెట్స్ మనషులను గురించి అనుకునేవారు. బాస్టన్‌లోని వారు న్యూయార్క్ వర్తకులని దురాశ పూరితులూ ధనాశా పరులూ అని పేర్కొనేవారు.

దక్షిణ రాష్ట్రాలవారు న్యూఇంగ్లండు లోని వారిని చిన్న చూపు చూస్తూ మాట్లాడేవారు. ఫిలడల్ఫియాలోని స్త్రీలు ఇంటికి పనికొస్తారు గాని మహా నగరుసరుకు అని సామెత. పురుషులు తడిబట్టలతో గొంతుకోస్తారట, కడుపు నిండా సారాయిపట్టించనిదే న్యూ ఇంగ్లండువాసులు పోరాడేందుకైనా, ప్రార్థించేందుకైనా పూనుకోరని దక్షిణ రాష్ట్రాలవారు అనేవారు, అంగ్లపాలకు లకి ఇవన్నీ తెలుసు. వలసల మధ్య గల అంతఃకలహాలు చల్లారిపోకుండా వాటిని రాజేస్తూ, దేశం ఏకోన్ముఖం కాకుండా తగు జాగ్రత్త పడేవారు. మెట్లవద్దకు వచ్చాడు జాన్‌యాడమ్స్ మాట్లాడుతున్న వ్యక్తులమధ్య నుంచి చోటుచేసుకుంటూ వెళ్ళి, తన సానంలో కూచున్నాడు ప్రతినిధులు తమ చమత్కారాలనీ, పాండిత్య ప్రకర్షనీ మననం చేసుకుంటూ, తాము జరపబోయే వ్యాయామానికి సంసిద్ధు లవుతున్నారు. వారు పేర్కొనబోతున్న అంశాలూ ఆ వాద ప్రతివాదాలూ, యాడమ్స్‌కి కంఠతా వచ్చు. "మాలో ప్రతి ఒక్కడూ గొప్ప ఉపన్యాసకుడు ; పెద్ద విమర్శకుడు. అద్భుత రాజ నీతిజ్ఞుడు. ప్రతి వొక్కడూ గొప్పవాడే, ముళ్ళువేసి, చిలకపలుకులు వలించడం లో మావాళ్ళు అఖండులు. సాహిత్యో పమానాలూ, భలోక్తులు, గణిత సామ్యాలు, రాజకీయాలూ, చరిత్ర వ్యాయశాస్త్రమూ సమస్త విషయాల తోను ప్రతినిధులు తమ కంఠ మాధురికి తామే ముగ్ధులవుతూ మమ్మ ఆనందపరుస్తారు" అని జాన్ యాడమ్స్ తన భార్యకు వ్రాశాడు.

ప్రతినిధులందరూ కనీసము ఈ రోజున తమ శుష్కవాద ప్రతివాదాలు కట్టిపెట్ట, వివాదంలో కాలం వెళ్ల బుచ్చక, తమ ముందు గల మహా సమస్యను ఏకీభావంతో పరిష్కరించా లని కోరుకున్నాడు యాడమ్స్.

"ఆ వ్యవసాయదారు రాడు యివ్వాళ" అన్నాడు జేమ్స్‌విల్సన్ 'వ్యవసాయదారు' అనగా జాన్ డికెన్సన్ అని అతని వుద్దేశము మారిస్ కూడా యీ రోజున రాక పోవచ్చు.

"వారు రాకపోవడము ఒకందుకు మంచిదే" అన్నాడు యాడమ్స్. ఏకాభిప్రాయానికి వచ్చే అవకాశము ఎక్కువ యిందన్నమాట పెన్సిలవేనియా ప్రతినిధుల సంఖ్య అయిదుకు తగ్గింది, అందులో ఇరువురు స్వాతంత్ర్యానికి సుముఖులు, ఇరువురు వ్యతిరేకులు. ఒకరు అనిశ్చితంగా వున్నారు. జాన్‌మార్టన్ వంక చూశాడు యాడమ్స్. మార్టన్ విచార వదనంలో ఆ నిశ్చయమేమిటో ద్యోతకమవుతోంది. యాడమ్స్‌కి ఇప్పుడు డెలవార్ ఒక్కటే సంశయాస్పదంగా వున్నది. సీజర్ రోడ్నీ యింకా రాలేదు. మాక్కీన్‌కేమైనా తెలుసునేమో! 'ఏమైనా ఖబురు తెలిసిందా?' అని అడిగాడు మాక్కీన్‌ని యాడమ్స్, "ఇంకా తెలియలేదు, డోమన్ నుంచి రావాలి, తుపాన్ కదా, రోడ్లన్నీ గుంటలు, మధ్యాహ్నానికైనా మనిషి రావచ్చు" అన్నాడు మాక్కీన్.

"అయితే అతను వొచ్చేదాకా మనము వోటింగ్‌ని ఆపివుంచడము మంచిది" అన్నాడు యాడమ్స్, డెలవార్ నుంచి ఆ వ్యక్తి వచ్చే దాకా ఇతర ప్రతినిధులు వాగ్వాదంతో కాలము వెళ్లబుచ్చి ముఖ్యతీర్మానము వోటింగ్‌కి రాకుండా చూడాలి యాడమ్స్ తన సీట్లో కూచున్నాడు. తన మిత్రుల వాగ్ధోరణివీ వారికి వాద ప్రతివాదాలపై వుండే అభిలాషనీ ప్రోత్సహించేందుకు సిద్ధంగా వున్నాడు.

అధ్యక్షుడు హాన్‌కాక్ ఈ రోజున విరాకుగా వున్నాడు. అందుకు ముఖ్య కారణము అతని అనారోగ్యము. వాతావరణము బాగుండని కారణముగా అతని దీర్ఘవ్యాధి తిరగపెట్టింది. సభ ప్రారంభమయింది.

ప్రతినిధులు ఆనాటి కార్యక్రమాన్ని పరిశీలించడానికి సంసిద్ధులై కూచున్నారు, సీజర్‌రోడ్నీ మేఘాలమీద వస్తున్నాడు. తుపానుకి లెక్కచేయకుండా గుర్రం అలా దౌడు తీస్తూ వుంది. కొండవాగులూ జలప్రవాహాలు దాటుతూ ఏదోవిధముగా కాలాతీతం కాకపూర్వం నిర్ణీత స్థలం చేరుకోవాలి. మనిషంతా తడిసిపోయాడు అలసిన గుర్రమూ అయానపడుతున్న రౌతూ చీకట్లని మింగుతూ ముందుకు పరుగు తీస్తున్నారు. జల ప్రదేశాలు యీదుకుంటూ, యిసుకనేలలు దాటుకుంటూ మన్నూ బురదా లక్ష్యపెట్టకుండా, ఘట్టినేల కోసమై ప్రాకులాడుతూ ప్రయాణము చేస్తున్నాడు. రోడ్నీ, అప్పుడే తెలతెలవారుతూందనగా అతను సగము స్వారీ చేస్తూ సగం యీదుతూ 'ఎపోక్వినీ మింక్ క్రీక్' వద్ద వున్నాడు. తొమ్మిది గంటలవేళ న్యూజాజిల్ చేరుకున్నాడు.

హాన్‌కాక్ తను అందుకున్న లేఖలని ప్రతినిధులకి ఒకదాని తరువాత ఒకటిగా వినిపిస్తున్నాడు. జనరల్ వాషింగ్టన్, బెనడిక్ట్ ఆర్నాల్డ్, ఛార్లెస్‌లీ పంపిన నివేదికలు - అదనపు సేనలు తక్షణ ముపంపమని యుద్ధసామగ్రి ఇతర సరుకులూ, వెనువెంటనే అంద చేయమనీ అత్యవసర విన్నపాలు. 'యుద్ధమండలి' అధ్యక్షునిగా యాడమ్స్ తాను చేయగలిగినదంతా చేస్తున్నాడు. మందు గుండు సామానూ యుద్ధపు సరుకులూ ఉత్పత్తి చేయిస్తున్నాడు. ఫిలడల్ఫియాలో యుద్ధకవచాల ఫ్యాక్టరీ ఒకటి ప్రారంభించారు. రోజుకి యిరవై అయిదు కవచాలు అది తయారు చేయగలదు. వొచ్చిన వుత్తరాలని జాన్‌యాడమ్స్ నిశ్శబ్దంతో పరిశీలించాడు. ఎన్ని అవరోధాలు వుండనీగాకి స్వాతంత్ర్యం కొరకై జరిపే పోరాటము సాగవలసిందే. అక్కడ సజీవంగా కన్పడుతున్న దాన్ని తాము ఆమోదించడమా లేదా అన్నదే కాంగ్రెస్ ప్రతినిధులకు ఏర్పడ్డ



ఎవరెవరు ? ఏ చిత్రంలోనిది ఆ వేషధారణ ? సరిగా చెప్పగలిగిన మొదటి ఇరువురికి పదేసి రూపాయి బహూకరించగలము. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు చీట్లువేసి మొదటి ఇరువురికే బహుమతి యివ్వడం జరుగుతుంది. మీ జవాబు కార్డు మీదనే వ్రాయండి. మాకు అందవలసిన చివరి తేది : 5-3-1989.

JAGATI - 2, Kutchery Road, P B 2922, Madras - 600 004

ప్రశ్న. తమ ప్రకటనవల్ల యీ ఆందో ళనకి నూతనశక్తి చేకూరుతుంది.

హాన్‌కాక్ ఇతర విషయాలు పరి శీలించ నారంభించాడు. రాష్ట్రసభల నుంచి జేరిన వుత్తరాలు, కమిటీల నివేదికలు, చెల్లించవలిసిన బిల్లులు, యాండర్సన్ సూచించిన సూచినని హాంకాక్ వుదాహరించాడు. ఒక జలాం తర్గామిని కనిపెట్టానని యాండర్సన్ అన్నాడు. తన జలాంతర్గామి న్యూయార్క్ రేవులో గల శత్రు నౌకా బలాన్ని ముంచి వేయగలదని అతని అభిప్రాయము.

"అది ఒక పగటి కల - స్వర్గానికి నిచ్చెన వేయడం లాటిది" అన్నాడు రాబర్ట్ పెయిన్.

"అది ఆచరణయోగ్యమో లేక పగటి కలో అనుభవంమీద కదా రుజువ యేది! యాండర్సన్‌కి ఒక పరిచయ లేఖ నిచ్చి జనరల్ వాషింగ్టన్‌కి పం పడంలో నష్టమేమున్నది" అన్నాడు స్టీపెన్ హాప్‌కిన్స్. రోడ్ అయిలాండ్ ప్రతినిధి అతని సవరణని బలపరి చాడు.

తరువాత వారు తీసుకున్న విష యం స్వాతంత్ర్య తీర్మానం గురించి. 'ఎల్లరీ' స్వాతంత్ర్య తీర్మానానికి పూర్వము వివిధ వలసల సమాఖ్య గురించి పరిశీలిద్దామన్నారు. ఇందులో ముఖ్యమైన చర్చనీయాంశాలు రెండు వచ్చాయి. ఒకటి ప్రాతినిధ్యం ; రెండు : పన్నులు. ప్రతివలసకీ సమాన వోటు వుండటమా లేక జనాభా సంఖ్యని బట్టి వలసల ప్రాతినిధ్య మేర్పడటమా? జనాభా సంఖ్యని బట్టి ప్రాతినిధ్య పెద్ద వలసలు తమని అణచివేస్తాయని చిన్నవలసల వారు భయపడ్డారు.

"ఇంగ్లండూ స్కాట్లెండూ ఏకమై బ్రిటను ఏర్పడుతున్నపుడు స్కాట్లండు వారు కూడా యిదేరీతిని భయపడ్డారు కాని, స్కాట్లండు నుంచి వచ్చిన ప్రతి నిధులే పార్లమెంటులో ప్రముఖులై, రాజ్యచక్రాన్ని తిప్ప గలిగారు" అన్నాడు డాక్టర్ ఫ్రాంక్లిన్.

జనాభా ప్రకారం మనము వోటింగ్ పెట్టుకుంటే మన స్వాతంత్ర్యము సుర క్షితముగా వుంటుంది. దేశంకోసము పాటుబడాలనే మనిషి. దేశముతో పాటు తన వలసికి కూడా సేవ చేసిన వాడవుతాడు" అన్నారు ఒకరు. జాన్ యాడమ్స్ ఈ దృక్పథము అంగీకరిం చాడుగాని, అతని అంగీకారానికి యితర కారణాలు వున్నాయి. "హేతువు, న్యాయమూ, సమాన త్వమూ - ఈ మూడూ ఏనాడూ మాన వులచేత మంచిపనులు చేయించలే కుండా వున్నాయి. ఈ ఉదాత్తగుణాలు ఎప్పటి కప్పుడు వోడి పోతూనే వున్నాయి. స్వ ప్రయోజన మొక్కటే వీటికంటె బలిష్టమైనదిగా కనబడు తోంది. స్వప్రయోజనమూ స్వలాభమూ మాత్రమే నమ్మతగ్గవి అంటాను. ప్రతి నిధులు ప్రతివలస తనకుగల సంపదని బట్టి పన్ను చెల్లించాలని అన్నారు. కాని, ఆ సంపదని కొలిచేదెవడు? విలువ నిర్ణయించేదెవరు? ఏప్రకారము నిర్ణయించడం?" (ఇంకా వుంది

సుమారు 60 సంవత్సరాల క్రిందట మద్రాసు వచ్చిన, ముద్దా విశ్వనాథంగారు కొన్నాళ్లు ఇద్దరు బట్టలూ, స్వదేశీ కలాలూ అమ్మారట. స్టెనొగ్రాఫరుగా ఒక యింగ్లీషు కంపెనీలో చేరి సమయపాలనా, క్రమ శిక్షణ నేర్చుకున్నారట.

"అదిగో ఆ ఫోటో చూశారా? అయనే నా ఏకైక దైవం. మనసా వాచా అయన్నే ఆరాధిస్తాను" అంటూ చూపించారు, లియోటాల్‌స్టాయ్ చిత్రం. టాల్‌స్టాయ్ కథలు అనేకం తెలుగు లోకి కర్జుమా చేశారు విశ్వనాథంగారు.

పచ్చని, చల్లని ఆశ్రమాన్ని గుర్తుకి తెచ్చే విశ్వనాథంగారి నివాసం, పరి శుభ్ర వాతావరణంలో పొందికగా ఉంది. ఉయ్యాల బల్ల, జంపఖానాలు పరిచిన నవారు మంచాలు, పాతకాలపు కుర్చీలు, కొబ్బరి, జామ చెట్లూ, బంగారం రంగులో విరగబూసిన కన కాంబరం, అందరినీ ఆప్యాయంగా పలుకరించే వారి అర్ధాంగి లక్ష్మిగారు .... అదంతా మనసున హత్తుకుపోయే కమనీయ దృశ్యమాలిక.

—సరోజినీ ప్రేమ్‌చంద్



సుమారు 60 సంవత్సరాల క్రిందట మద్రాసు వచ్చిన, ముద్దా విశ్వనాథంగారు కొన్నాళ్లు ఇద్దరు బట్టలూ, స్వదేశీ కలాలూ అమ్మారట. స్టెనొగ్రాపరుగా ఒక యింగ్లీషు కంపెనీలో చేరి సమయపాలనా, క్రమ శిక్షణ నేర్చుకున్నారట.

"అదిగో ఆ పోటో చూశారా? అయనే నా ఏకైక దైవం. మనసా వాచా అయన్నే ఆరాధిస్తాను" అంటూ చూపించారు, లియోటాల్‌స్టాయ్ చిత్రం. టాల్‌స్టాయ్ కథలు అనేకం తెలుగు లోకి కర్జుమా చేశారు విశ్వనాథంగారు.

పచ్చని, చల్లని ఆశ్రమాన్ని గుర్తుకి తెచ్చే విశ్వనాథంగారి నివాసం, పరి సర వాతావరణంలో పొందికగా ఉంది. ఉయ్యాల బల్ల, జంపఖానాలు పరిచిన నవారు మంచాలు, పాతకాలపు కుర్చీలు, కొబ్బరి, జామ చెట్లూ, బంగారం రంగులో విరగబూసిన కన కాంబరం, అందరినీ ఆప్యాయంగా పలుకరించే వారి అర్ధాంగి లక్ష్మిగారు .... అదంతా మనసున హత్తుకుపోయే కమనీయ దృశ్యమాలిక.

—సరోజినీ ప్రేమ్‌చంద్



## చిత్రజగతి

### సమీక్షలు

### స్వాతీ వారి 'ఇలు ఇల్లాలు పిల్లలు'

అధునిక జీవన విధానంలోని ఆర్థిక ప్రభావాల కారణంగా, కుటుంబ వ్యవస్థ ఎలా శిథిలమవుతున్నదో చూపుతూ, అందులో ముఖ్యంగా మధ్య తరగతి సంసారి, ఇంగువ కట్టిన బట్ట లాటి ఆచారాల మధ్య ఎలా సతమత మవుతూ కాలాతీతమయాకగాని కళ్ల తెర్వక పోవడాన్ని, దర్శకులు విసు ఎంతో సమర్థవంతంగా రూపొందిం చారు ఈ చిత్రంలో. అయితే యిందు లోని సుబ్బయ్య (విసు) మధ్య తరగతి మనస్తత్వం గల కార్మికుడు. తమ ప్రెస్సులో తండ్రిగారి కాలం నుంచీ మెషిన్‌మాన్‌గా పని చేస్తున్నాడని యజమాని చెప్పడం, 'కోటీశ్వరరావు (రమణమూర్తి) నశించాలి' అని పిల్లల చేత ప్లాకార్డులు పట్టించడం, కోటీ శ్వరరావు కూతురుని లేపుకు రమ్మ నడం - యివన్నీ కార్మికవర్గ మనస్త త్వానికి చెందిన లక్షణాలు. కోడలు పార్వతి చేత రికార్డ్‌డాన్స్ చేయించి, పెద్దకొడుకు ఆనంద్‌ని మిరాండా ఆకర్షణ నుంచి కాపాడగల నను కోవడం కూడా అలాటిదే! ఇక, లక్ష్మి (శారద) నిత్యం జరిపే పూజలోవుంచే వెండిదీపం శెమ్మాలు, ఆమె ఉంగరం వేలులో యిరుక్కు పోయి బయటికి రాక చివరికామె మరణానికి హేతు వైన వజ్రపుటుంగరం, ఇద్దరబ్బాయిలా యిద్దరమ్మాయిలు తన మాట వినాలనీ వింటారనీ అనుకోవడం, పెద్దకూతురు సులోచన (అరుణ) తన తల్లితో 'నీమొగుడు' (తండ్రి గురించి) అనడం, అలాగే పెద్దకోడలు పార్వతి తన కాపరం సరిదిద్దిన అత్త మామల పట్ల వీసమంత కృతజ్ఞత కూడా లేకుండా 'తన మొగుడు' తో వేరు కాపరం పెట్ట డం - యిలాటివన్నీ మధ్యతరగతి లక్షణాలు. ఎవరి సదుపాయం వారు చూసుకోవడమే గాని తలి దండ్రుల ఉనికి, తమ కర్తవ్యం పట్టించుకోరు. రెండో అమ్మాయి ఉమ, ఆమెని కోరు కున్న యువకుడు (తులసీరామ్) - వీరిద్దరే ఉత్తములు. - మిగతా అందరూ స్వార్థపరుల్లా కనిపిస్తారు. ఆ స్వార్థం, ఎవరికి వారు తమ 'మార్గం' చూసుకు రెక్కలొచ్చాక ఎగిరిపోయే పక్షుల స్వభావం లాటిది. పుట్టింటివారి మాట భర్త వద్ద దాస్తుంది; భర్త కోపాన్ని పిల్లల వద్ద దాస్తుంది; పిల్లల తొందరబాటుని తన

కడుపులో దాచుకొంటుంది: ఇలా ఒకరిమాట ఒకరి వద్ద దాచడంతో, దాపరికంతో స్త్రీ జీవితం గడుస్తుంది - అని లక్ష్మి చేత అనిపించడం ఎంతో సంధర్భోచితంగా ఉంది. కథాబలం గల ఈ చిత్రానికి విసు ప్రధాన పాత్ర ధారి కాగా, మిగతా అందరూ తమ పాత్రలకు న్యాయం చేకూర్చారు. ఆకెళ్ల సంభాషణలు నాటకీయతకు పుష్టి నివ్వగా సీతారామశాస్త్రి పాటలు సాహిత్యం చిలకరించాయి. పాటలు నిర్మాత: పుష్పాభట్.

## చిత్రసౌభాగ్యచిత్ర 'ప్రజాప్రతినిధి'

సింహాసనం, మండలాధీశుడు, నా పిలుపే ప్రభంజనం - ఆకోవలోని మరొక చిత్రమిది. కృష్ణచైతన్య (కృష్ణ) ఐపియస్ ఆఫీసరు. దశ కంఠరావు (మోహన్‌బాబు) పిచ్చయ్య దొర (కోట శ్రీనివాసరావు) సహ కారంతో సహాయ సంపత్తులతో మంత్రి అవుతాడు నాయక ప్రతినాయకులలో ఒకరు పోలీసాఫీసరు, మరొకరు హోమ్ శాఖామాత్యులు. 'నా భాష అర్థమయిందా ?' అనే ఊతపదంతో మాట్లాడే ఈ మంత్రి వర్యుడు ఒక కారికేచర్ మాత్రమే! ఎంత బూత్ కాప్చరింగ్ జరిగినా, ఎంతటి గూండా యిజమ్ వీర విహారం చేసినా, ప్రజలు అటువంటి విదూషకుని ఎన్నుకోరు. రాజకీయ చిత్రాలలో రాజకీయ వాస్త వికత కొంచెమైనా ఉండాలి. కృష్ణ చైతన్య భార్యని (జయసుధ) వరం గల్లులోని రౌడీలు కసికొద్దీ చంపారంటే అర్థం ఉందిగాని, ఆమె కాళ్లమీదుగా కారు పోనివ్వి అవిటిదానిని చేయడ మేమిటి? అవిటి భార్యని ప్రేమిస్తూ అందాలసుందరిని (శోభన) హద్దు మీర వద్దని వారిస్తూ, పై అధికారి సైతం వంచకుడవటం వల్ల, ఉద్యో గానికి రాజీనామా యిచ్చి, ప్రజాప్రతి నిధిగా లోకాన్ని ఉద్ధరించబోతాడు కృష్ణచైతన్య .... 'ఇదేమిరాజ్యమో రన్నా, చూడబోతే రెండు కళ్లు బోతుం డాయే' (దాసరి) పాట చిత్రమంతకీ హైలైట్‌గా గద్దర్‌ని గుర్తుకి తెస్తుంది. ప్రతిభావంతుడైన దర్శక నిర్మాత దాసరి నారాయణరావు నుంచి యింత కంటె పటుత్వం గల పిక్చర్ ప్రేక్ష కులు ఆశించడం సహజం.

అనువుగాని చోట సాహసం అర్థ రహితం. ఇచ్చి పుచ్చుకోవడాలు లేకుండా సంఘజీవిత మనేది ఉండదు. సంభాషణ అనగా ఎదుటవారిని ప్రశ్నలు వేయడం కాదు. మట్టిబుర్రలు తప్ప మిగతా ఎవరూ డబ్బు లేకుండా రాయరు. సంఘ విద్రోహి చిట్ట చివర ధరించే ముసుగు ప్రజాసేవ. ఇతరులకి బాధ కలిగించే బదులు మనం బాధ పడటం మంచిది.

ప్రేమ అనగా వెర్రి బాగుల వాని లోని వివేకం, వివేకవంతునిలోని వెర్రిబాగులతనం.

—సామ్యూల్ జాన్సన్

సీరియల్

# మజిలి

## అన్నపూర్ణా రెడ్డి

అన్నగారింటికి, తన పుట్టిల్లు అనే భావనతో వచ్చిన గాయత్రి, ఆ యింట్లో వున్న జానకి ఎవరో అన్నగారు ఆమెకి ఎందువల్ల ఆశ్రయమిచ్చాడో తెలుసుకోవాలని ఆరాటపడి, తెలుకోలేక వెళ్లిపోయాక, డాక్టరు సారథితో జానకి తన మనసులో మాట చెప్పుకొవేందుకు ప్రయత్నించి విఫలురాలైంది .... ఇక చదవండి.

“నన్నే కాదు, విజ్జీని, రవిని పిలిచి ఏం వేషం ఆ మొండి చేతులు, గిరిజాల జుట్టు .... మీ ఇంట్లో వుండేది మీ పిన్నా? .... మీ అమ్మలేదూ .... ఏమైంది .... అంటూ ఏమేమో అడుగుతుంది’. ఏం అనదు కానీ .... రవికి కోపం వచ్చి ‘మా సంగతి నీకెందుకు.. నోరుమూసుకో అంటాడు’ ‘‘నేనెందుకు నోరుమూసుకోవాలి... బాగా మాట్లాడగలను” అంటూ పిలిచి మరీ కవ్విస్తుంది. .... అయ్యే లేకుండానే మీ అమ్మ నిన్ను కనిందిరా.... సిగ్గులేని వెదవా... అంటూ ఏమేమో అంటుంది.... పిన్నీ”

వాడలా అమాయకంగా అడుగుతూంటే తల మీద చేయి వేసి నిమురుతూ, “నాన్న లేకపోవడమేమిటి బాబు!.... దూరంలో పెద్ద ఉద్యోగం చేస్తున్నాడు. మరి అమ్మ కూడా ఉద్యోగం చేస్తోంది కదా?... ప్రతి ఒక్కరికీ అమ్మా నాన్నా వుంటారు. బాబూ. కాకపోతే తల్లిని అని చెప్పుకుందుకు, తల్లి సిగ్గుపడక పోయినా, తండ్రి అని ఒప్పుకుందుకు పిరికితనం అడ్డొచ్చి తప్పుకుంటారు కొందరు.. ఇప్పుడు తెలిసింది కదూ?...” - అంది జానకి. తలూపాడు వాడు...

కాస్సేపు ఊరకుండి “పిన్నీ... అసలు... ఆ నవరత్నం... ఆ దారిలో. ఏ పిల్లలు వెళ్ళినా ఏదో పనిగట్టుకొని దగ్గరకు పిలుస్తుంది.... వాళ్ల గురించి ఏదేదో అడుగుతుంది.... కాసేపటికి తిట్టుతుంది, వాళ్ల తిట్టుతారు .... వెక్కిరిస్తారు .... ఎందుకు పిన్నీ...” ....“అట్టాగా?” అని ఆలోచనలో పడింది జానకి.... నవరత్నం మనస్తత్వం ఎలాటిదో అర్థం చేసుకుందుకు ప్రయత్నిస్తూ మౌనంగా వుండిపోయింది కాస్సేపు.

వాడి బుగ్గ సవరిస్తూ. “నారీ.... అందుకేనన్నమాట.... కొట్టు మీదకి రాళ్ళిసిరింది?’’

ఔనన్నట్టు తలూపాడు.

ఇంకెప్పుడు అలాటి పొరపాటు పనులు చేయకేం... ఆ రాయి నవ రత్నానికి కానీ, మరెవరికైనా కానీ తగిలితే ప్రమాదం కదూ ?...." అంటూ నుదుటి మీద చిన్నగా ముద్దు పెట్టుకుంది.

అంతటికే వాడు ఉబ్బితబ్బిబై పోయాడు.

'పెద్దమ్మకు కోపం తెప్పించే పనులు చేయకు. బుద్ధిగా వుంటావు కదూ ?.. రాత్రుల్లో పలక తీసుకొని నా దగ్గరకు వచ్చేయి. విజ్జి వాళ్ళతో పాటు చదుకొందువుకాని.... అక్షరాలు నేర్చుకుంటే వచ్చే సంవత్సరం బళ్ళొచేరచ్చు'

అప్రయత్నంగా జానకి మెడ చుట్టూ రెండు చేతులువేసి "పిన్నీ నీవెంత మంచిదానివి" అన్నాడు నారాయణ.

"నా మంచికేం లేరా భడవా" అంది బుగ్గనొక్కుతూ.

కిలకిల నవ్వాడు వాడు. చేతులు విడిచేసి ప్రక్కకు తిరిగాడు వాడూ, గుమ్మంలో సీతారామమ్మ నుంచొని వుంది.

నారాయణ ముఖాన నవ్వు ఆవిడకు క్రొత్తగా వుంది. ఎప్పుడు ఏడ్చుకొంటూనో, దొంగ చూపుల్తోనో నక్కి తిరిగే చిన్నబోయిన వదనం ఎరుగున్న సీతారామమ్మకు ఆ నవ్వు ఏదో క్రొత్త సందేశాన్ని ఇచ్చింది.

అలికిడైతే ఇటు తిరిగి చూచి "ఓ .... పిన్నిగారా .... రండి...." ఆహ్వానించింది జానకి.

"లేదమ్మా .... మా భడవాయి అవుపించక పోతేనూ...." అంటూ అక్కడ నిలువకుండా వెనుతిరిగింది ఆమె.

పిల్లిలా అనుసరించాడు నారాయణ.

## 15

"మంచి అమ్మాయినే పట్టారు ...." జ్యోత్స్న ఎత్తి పొడిచింది.

"ఎవరి జీవితావసరాన్ని వారు వెతుక్కోవడంలో తప్పులేదు కదా?" సారధి ఎదురు ప్రశ్న వేశాడు.

"దెప్పి పొడుస్తున్నారా?"

"దెప్పిపొడిచే ప్రసక్తే లేదే .... సాంఘిక నియమాలన్నీ స్త్రీ రక్షణకు కట్టుబాటుకే వినియోగించినవి. స్త్రీగా జన్మించి.... మాతృత్వాన్ని పొంది, ఇద్దరు పిల్లలకు తల్లివై వుండి కూడా సౌందర్యోపాసన అంటూ నీవు వెళ్ళగా లేనిది, సాంఘిక నియమం అడ్డు నీకు రానిది,.... స్వేచ్ఛా విహంగంలా విహరించే పురుషుణ్ణయిన నాకు అడ్డేమిటి ?" జ్యోత్స్న కళ్ళలోకి చూస్తూ అడిగాడు సారధి.

"రక్షణ పేరుతో.... సాంఘిక నియమాలంటూ స్త్రీని చట్రాల్లో బిగించి - పురుషుడు బైట బాహాటంగా హాయిగా తిరిగొస్తాడు. స్త్రీపురుష పక్షపాత మెందుకు.... స్త్రీ మనిషి కాదా ?.... కోర్కెలుండవా ?"

"కాదన్నదెవరు? ..... ఆ కోర్కెలెప్పుడూ వెర్రితలలు వేయకుండా వున్నంతవరకే స్త్రీ అన్న ప్రసూనం, తన వ్యక్తిత్వాన్ని కాపాడుకొంటూ, తనకు లభించే గౌరవాన్ని పొందా

లంటే, ఒక పట్టుకొమ్మను అంటి పెట్టు కున్నప్పుడే రాణిస్తుంది. స్వేచ్ఛ పేరిట విశృంఖలత్వాన్ని ఆహ్వానించినప్పుడు కాదు."

"జానకి గురించి అడిగితే, సూటిగా చెప్పేదానికి ఎంత డొంక తిరుగుడు మాటలు .... సరి.... జానకి ఎవరైతే నాకేం.... కానీ" రెండు చేతులతో ముడి సవరించుకోవడంతో.... ఆవిడ అసమాన అవయవ సౌందర్యం ప్రద ర్శితమైంది.... అందమైన అజంతా శిల్పంలా.... శాపవశాత్తు భువిలో జన్మించిన దేవకాంతలా, ప్రాణమున్న పాలరాతి విగ్రహంలా... ప్రతి అవయవంలోని సౌందర్యం తొణికిస లాడుతోంది. ఇద్దరు పిల్లల తల్లి అంటే ఎవరూ నమ్మరు.... అలవోకగా చూస్తూంటే అధరాలపై విరిసే ఆ చిరునవ్వు తళుకులు మగవాడి గుం డెల్లో గిలిగింతలే!

## 16

సారథి డాక్టరీ చదివే రోజుల్లో - గుండెల కదుముకొన్న పుస్తకాల దొంతరలో గాలికి రెపరెపలాడే మేచింగ్ చీర బ్లౌజుల్లో, మంద గమనలా, మయూరంలా, అల్లనల్లన దారివెంట దాదాపు రోజు ఎదురయ్యేది ఆ అమ్మాయి.

ఎంత బుద్ధిగా కళ్లు దించుకొని నడ వాలన్నా మాట వినకుండా దారి పొడ వునా ఆ కదలి వెళ్ళే పాలరాతి శిల్పం కోసం కళ్ళు పరుగులెట్టేవి. దగ్గరయ్యాక కళ్లు ఆమె ముఖం వైపు తిరిగేవి. చిత్రంగా ఆ పడుచు కళ్లు కూడా సారథివైపే తిరిగి వుండేవి. తన చూపులతో ఆ యువతి చూపులు కలిపే ఆ అరఘడియలలో - సారథికి ప్రపంచమంతా శూన్యంగా, తామిద్దరే యదార్థాలుగా అన్పించేది. తెలియ కుండానే అతడి అధరాలపై గర్వంతో కూడిన చిరు హాస రేఖ మెదిలేది. అదేసమయాన ఆ అమ్మాయి గుండెల్లో అతడి రూపం ముద్రిత మౌతోందని సారథి ఎరుగడు.

సగటు మనుషుల్లో - స్ఫుర ద్రూపి - చూడగానే ఆకట్టుకొనే ఆ సుందర రూపాన్ని పదేపదే చూడ్డం కోసం అవతలివ్యక్తి తపిస్తోందని ఎరుగడు సారథి.

రోజులు హాయిగా దొర్లిపోయేవి. సెలవులొస్తే మాత్రం తన పాలిట శాపంగా భావిస్తున్నాడు సారథి.

సహజంగా బిడియస్తుడైన సారథి. ఆ అమ్మాయి పేరు తెలుసుకోవడానికి కూడా ధైర్యం చేయలేకపోయాడు.

ఓ రోజు పార్కులో కలవని తలం పుగా ఎదురైన ఆ అమ్మాయి "హల్లో, మైనేమ్ ఈజ్ జ్యోత్స్న.... బి.ఎ. ఫైనల్" అంది.

"ఐయామ్ సారథి ఫైనల్ ఎంబి" ధైర్యాన్ని కూడ గట్టుకొని వుక్కిరి బిక్కిరి అవుతూ పరిచయం చేసు కున్నాడు.

తరువాత చిరకాల స్నేహితుల్లా అరమరిక లేకుండా ఓ రెండు గంటల సేపు ఓ బెంచీ మీద కబుర్లతో కాల క్షేపం చేశారిద్దరూ.

అనతి కాలంలోనే జ్యోత్స్న అంటే ఏమిటో అర్థమైంది సారథికి.

జ్యోత్స్న సౌందర్యో పాసకురాలు .... అందమైన ఏ వస్తువు అయినా సరే తన్నాకర్షించ గల్గితే ఇక ఆ లోకంలో మైమరచిపోయేది.

ఉరకలు వేసే యవ్వనం.... కట్టు తెంచుకు పారిపోవడానికి సిద్ధంగా వున్న కోర్కెల గుర్రాలు. మనసులు కలవడం ఆలస్యంగా ఆ సెలవుల్లో సారథి జ్యోత్స్నల పెళ్ళి వైభవంగా జరిగింది.

జ్యోత్స్న, తల్లి దండ్రులకు రెండవ సంతానం. ఇద్దరూ ఆడపిల్లలే కావడం చేత తండ్రి నిరంజన్‌గారు పిల్లలను స్వేచ్ఛగా పెంచారు. నిరంజనం గారు కేంద్రప్రభుత్వోద్యోగి.

జ్యోత్స్నకు నిర్భయత్వం మెండు. అయినా దురుసు స్వభావికాదు. చెప్ప తలచుకున్నది ముఖాన్నే చెప్పడం అల వాటు.

వివాహం జరిగిన సంవత్సరంలోనే తమ వలపుల పంటగా రవిని ఎత్తు కున్నారు జ్యోత్స్నా సారథులు.

సారథికి తండ్రిలేడు. తల్లి, పెళ్ళయి అత్తారింటికెళ్ళిన చెల్లి గాయత్రి, మాత్ర మే వున్నారు. పెద్ద స్థితిమంతులు కాక పోయినా లోటులేని జీవితం. పొలం సాగుబడి చేయించుకొంటూ భర్త కన్ను మూసిన ఆ ఇంటనే వుండి పోయింది సారథి తల్లి. గాయత్రికి జ్యోత్స్న అంటే వల్లమాలిన అభి మానం. ఓ అపురూపమైన దేవతలా అవుపించేది జ్యోత్స్న, గాయిత్రి కంటికి.

సారథి పెళ్ళినాటి రెండేళ్ళ బాబుకు తల్లి గాయిత్రి.

హౌసర్జన్సీ పూర్తయింది. ఉద్యోగా న్వేషణలో తిరిగే అల్లుణ్ణి :

"ఉద్యోగాల వేట ఎందుకోయ్. .... నిక్షేపంగా ప్రాక్టీసు పెట్టక ? .... ప్రయివేటు ప్రాక్టీషనర్‌కు జరిగినట్టు ఎవరికీ జరగదీ రోజుల్లో...." అంటూ తనకు తెలిసిన డాక్టరు ఎలా రెండు చేతులా ఆర్జిస్తూ ఎంతెంత మేడలు లేపారో - ఎన్నిలక్షల రొక్కం వెన కేశారో ఏకరువు పెట్టేవారు నిరం జనం గారు.

మామగారి మాటలు తోసి వేయ లేక ప్రాక్టీసు ప్రారంభించాడే గానీ .... అందులో అతనికి తృప్తి దొరకలేదు. ఫీజులపట్ల ఆసక్తి కనపర్చేవాడు కాదు. అవతల వ్యక్తి ఇష్టపడి చేతిలో పెట్టింది పుచ్చుకొని తృప్తి పడేవాడు. ఒక్కో సారి అడబ్బు పెట్టి నిరుపేదలకు ఎదురు వైద్యం చేసేవాడు.

మామగారి దృష్టిలో ఈలాటి పని పనికి మాలిన పనిగా మిగిలిపోయినా నిరుపేదల గుండెల్లో డాక్టరు సారథి దేవుడు.

ఉద్యోగం వచ్చేసరికి రవికి రెండేళ్ల నిండాయి. విజ్జి పుట్టింది. పల్లెటూరు పట్టణం కాని ఊరి పోస్టింగ్ వచ్చింది.

జ్యోత్స్నను, పిల్లలను వెంట పెట్టు కొని ఉత్సాహంగా వెళ్ళి ఉద్యోగంలో చేరాడు సారథి.

ఇన్‌పెషెంట్లు, ఔట్‌పెషెంట్లు. తరచూ తగిలే పోస్ట్‌మార్టమ్ కేసులు.

కోర్టులు, అదో రొటీన్ లైఫ్‌లో పడి పోక తప్పలేదు.

అలసి ఇంటికి చేరుకొంటే .... నట్టింట ఊయలలో పాప, బుడి బుడి నడకల్లో రవి, సౌందర్యరాసి, ప్రేమ మూర్తి అయిన భార్య.

ఎప్పుడూ గల గల శబ్దం చేస్తూ వొడ్డులను ఒరుసుకొంటూ, రాళ్లను రప్పలను ఢీకొంటూ పారే సెలయేరు లాటి జ్యోత్స్నకు .... ఆ కాపురం నిరుత్సాహం కలిగించింది.

రవి చిన్న బిడ్డగా వున్నపుడు, తమ ఊళ్ళో వుండడంతో ఆయా పిల్లడిని కనిపెట్టి వుండేది. పాలు పట్టడం, స్నానం .... బట్టలు మార్చడం అన్నీ ఆయా చూసుకొనేది. కులాసాగా నవ్వే సమయంలో బిడ్డను చేతుల్లో హొదువు కొని బుగ్గలన్నీ ముద్దులతో తడిపి వేసేది జ్యోత్స్న.

భర్తతో కులాసాకబుర్లు చెప్పుకోవడానికి, స్నేహితులతో సరదాగా తిరగడానికీ వీలు చిక్కేది.

కానీ అందుకు భిన్నంగా వుంది ఈ కొత్త కాపురం.... విజ్జిని సాకడం అసలు చేతకావడం లేదు .... విజ్జి ఏడుపు చికాకనిపించేది.

డాక్టరు భార్యగా సంఘంలో గౌరవ మర్యాదలు పుష్కలంగా వున్నా, ఏమిటో ఆరాటం .... అశాంతి. భర్త, ఇల్లు పిల్లలు .... వారి ఆలనపాలన .... ఆ పరిధిలో బిగించుకు పోయి చుట్టూ ప్రపంచాన్ని చూస్తూంటే ఆ వలయం మరీ చిన్నదై తనను కార్నర్ చేసి నిలబెట్టినట్లు అనిపించేది.

భర్త చూపే అనురాగం ఇప్పుడు తను వొక్కదానికే లభించడంలేదు.... అందులో కొంతభాగం పిల్లలకు పంచి ఇస్తోంటే, తన పరిస్థితి తనకే తోచని విధంగా తయారైంది.

చుట్టూ జీవితం, భయానకంగా, సంకుచితంగా తోస్తూంటే.... ఆఊళ్ళో వుండలేనన్పించింది జ్యోత్స్నకు.

వెన్నెల రాత్రి డాబామీద మంచంలో సేదదీరుతూ భార్య ముఖంలోకి చూస్తూ "పెళ్ళయిన మూడేళ్ళకే ఇద్దరు పిల్లల తల్లివై చాలా ఆరిందావయ్యావు" ... అన్నాడు సారధి.

నిశ్శబ్దంగా వుండి పోయింది జ్యోత్స్న. జడలో అరవిరిసిన మల్లెలు సౌరభాన్ని వెదజల్లు తున్నాయి. గాలికి పయ్యెద ఎగిరి సారధి ముఖానికి రాసుకొంటూ గిలిగింతలు పెడుతోంది.

"ఏయ్ మూగమ్మాయ్.... మాటలు రావా ?.... నీ పిల్లల ఆలనా పాలనలో చిక్కడి ఈ దాసుణ్ణి మరిచిపోతే ఊరుకొనేది లేదు"-చేయిపట్టి మీదకు లాక్కొని ముంగురులు సవరించాడు.

విడిపించుకొని లేవబోయిన జ్యోత్స్నను చేతులతో మరింతగా అల్లుకొని, ఈలా మౌనవ్రతం పాటిస్తే శిక్షేమిటో తెలుసా, ?.... అంటూ కసిగా బుగ్గలు కొరికేడు.

అతడి ప్రేమలో అరమరికలేదు. ఆవలపులో వేడి తగ్గలేదు. తొలిరేయి వలపు వెల్లువలో ఎలా కొట్టుకు పోయారో ఆలాగే గడుస్తున్నా జ్యోత్స్న

మనసులో ఏదో వెలిత, ఏదో అసం తృప్తి, ఏదో లోటు.

"జ్యోత్స్న ఏమిటా పరాకు? ఈలా చూడు - ఆ అంబర వీధిని మెరిసే ఆ తారకలు.... వాటి మధ్య గర్వంగా ఆ నిండు చందమామ !.... దొంగల్లా చాటు చాటుగా తప్పుకు పోయే ఆ మేఘ బాలలు, పాల మీగడ తరకల్లా లేవూ ? ....అల్లన మెల్లన వీచే ఈ పిల్లగాలి గిలిగింతలు పెట్టడం లేదూ ?" - మోచేతి మీద అనుకొని భార్య కళ్ళలో కళ్లుంచాడు.

ఇదివరలో అయితే అతడి ప్రతి గుసగుస .... తన ఎదలో ఏదో సవ్వడి రేపేది. ఏకాంతం కోసం పగలురేయి విచక్షణ లేకుండా తహతహ లాడేది తనువూ మనసు.... ఇప్పుడెందుకు భిన్నంగా జరుగుతోంది ?

తనకున్న జీవితం.... ఎంతో తృప్తి గలించేదే అయినా.... అందులో ఇది వరకులా తృప్తిని పొందలేక పోతోంది తను.

ఆ బస్తీలో, మధ్య తరగతి జీవిత విధానం వెగటు కల్గిస్తోంది.... తొలి నాటి కాలేజి జీవితం, ఆ స్వేచ్ఛా, ఆ ఉత్సాహం, తిరిగి కావాలని అంత రాంతరాల్లో ఏదో కోరిక....

మంచంమీద అశాంతిగా దొర్లి "ఏమండీ.... మనం.... ఈ ఊరి నుండి వెళ్లిపోదాం" అంది జ్యోత్స్న. "అమ్మాయ్.... రా మా య ణం లో పిడకల వేటలా.... ఇదేమిటి ? కమ్మగా పలపులు పండించుకొనే ఈ సుమధురతరుణంలో బదిలీల గొడవ ? మరోసారి ఆలోచిద్దాంలే".... మరోమా టకు తావీయకుండా దొండపండులాటి జ్యోత్స్న పెదవులను అందుకున్నాడు సారధి. ఆరాత్రి భర్త కౌగిలిలో హాయిని అనుభవించలేక పోయింది జ్యోత్స్న.

ఎదో ఏదో సన్నగా మొదలు పెట్టిన అసంతృప్తి.... నెమ్మదిగా హృదయాన్నంతా ఆక్రమించుకొంది.

ఇంటిని పరిసరాలను చూస్తూంటే విసుగు. భర్త ప్రతికదలికలో ఏదో చిరాకు, అతడి ఛలోక్తులకు ఏవగింపు. పిల్లలకు దూరంగా వుండాలన్న ఆలో చన.... రోజు రోజుకు జ్యోత్స్న మంచు శిలలా చల్లబడ సాగింది.

ఒకనాడు కోర్టు డ్యూటీ కెళ్లి తిరిగి వచ్చిన సారధిని చూస్తూ "సారధీ.... నేనీ ఊళ్ళో వుండలేక పోతున్నాను. కొంతకాలం మా ఇంటికి వెళ్ళివుండా లనుకొంటున్నాను" అంది....

సౌమ్యుడు, అతి నెమ్మదస్తుడు అయిన సారధికి భార్య ప్రవర్తన బాధా పూరితంగావున్నా సర్దుకుపోయే మన స్తత్వంతో ఆమెను సహిస్తూ వచ్చాడు. నివురు గప్పిన నిప్పులా మనసులోని గుంజాటన దాచుకొనిగంభీ రంగా మసలుకోవడం అలవాటు చేసు కున్నాడు. అందుకే జ్యోత్స్న ఆలా అడిగినప్పడు 'ఎందుకు, ఏమి' అని ఆరా తీయలేదు. జ్యోత్స్న పెరిగిన వాతావరణం తనకు తెలుసు, ఆవిడ సౌందర్యోపాసనా తనకు తెలుసు. ఆ సౌందర్యోపాసనవల్లే తను ఆమెకు భర్త కాగలిగాడనేది సత్యం. (ఇంకా వుంది)

"Why did Ravana abduct Sita in the guise of a brahmin while his quarrel was only with Rama and Lakshmana ?" asked Raghu.

"To humiliate Rama and thereby provoke him to fight. Rama had already smashed the outer bastion of Ravana by annihilating Khara, Dhushna and Trisira," said Raghu's Father.

"Isn't it nefarious on the part of a learned person like Ravana to steal another man's wife in such a sneaking way ?"

"No doubt Ravana had plenty of erudition, discipline and devotion but he was too ego-centric. As he got a boon from Brahma that he could preserve his physical body in good shape against all odds, he thought he was immortal though once in a way it flashed in his mind that all material existence was bound by dictates of Time. He kept Sita, not in his palace, but in Ashokvan where she was attended upon by women of noble birth. Ravana was aware that as a true Kshatriya, Rama was sure to invade Lanka to regain Sita – accepting or discarding was a different matter. Ravana very much wanted to test his might against this formidable foe and he realised his folly only when he fell down on the battle-field," explained Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*

## చొందా రచనలు

| | |
|---|---|
| నేటి విలువలు | పరిచయం చేసిన పుస్తకాలు |
| దూరాన్ని జయించిన మానవుడు | అన్యాయం |
| ఛార్లెస్ స్టీన్ మెజ్ | ఆఖరి కోరిక |
| కథానికలు | ఎక్కడికి కమలా ? |
| జీవనమార్గం | భానుమూర్తి భార్య |
| ఎలినార్ రూజ్‌వెల్ట్ | రాధ నవ్వింది |
| తొలి పాఠాలు | కొత్త లోకాలు |
| ప్రేమగాథ | కొన్ని గ్రంథాలు |
| హెలెన్ కెల్లర్ | సీతతో సినీమాకు |
| డా॥ మేరి వెర్టిస్ | ప్రజానాయకుడు ప్రకాశం |
| నేల - నీరు | నట్టింట దీపం |
| మహానగరంలో | మాంగుళూర్ మెయిల్ |
| జీవితం | మహాబలిపురం |
| నవచైనా | మనకీ ఒక కారు |
| ప్రతి గురువారం | సీతా ఫలాలు |
| ఆరు కథలు | భాష |
| చెట్లు | పూసల మేడ |
| మరొక ఆరు కథలు | శివరావు |
| ఈ నాగరికత | కలడో లేడో |
| నాలుగు రోడ్లు | మావో పాలనలో |
| అణుశక్తి | చైనాలో మైనారటీలు |
| బాలరాజ్యం | అమెరికా |
| గ్రామవైద్యుడు | జులై నాలుగు |
| సాహస యాత్ర | వరదల్లో వాంగ్ |
| అంతేనా | మాతా భూమాతా |
| కాఫీ మానెయ్యడం | చీమలబారు |

వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలనుకున్న వారు మీకు చేరువలోవున్న లైబ్రరీలో దొరికితే చదవండి.

# కొత్త పుస్తకాలు

'బ్రహ్మముగారి చరిత్రము' - రచన : విద్యాన్ కట్టా నరసింహులు. ప్రచురణ : వీరబ్రహ్మేంద్ర మిషన్, ఆనందాశ్రమం, వయా - మైదుకూరు, కడప జిల్లా. వెల రు. 3-00.

1983 లో ఈ 'మిషన్' ప్రారంభమయింది - ఇది వారి 46 వ ప్రచురణ. ఎ యస్ రామన్, డి ఆంజనేయులు, పుట్టపర్తి నారాయణాచార్యులు, చల్లా రాధాకృష్ణశర్మ శ్రీనివాస రాఘవన్ (శ్రీరంగం), రామానుజాచార్యులు (నెల్లూరు), కొండవీటి వెంకటకవి వంటివారు ఈ సంస్థకు సలహాదారులని పుస్తకం ఆరవ పేజీలో ఉండటంతో, ఈ సంస్థ చేస్తున్న సేవ ఎటువంటిదో, ప్రచారం ఎటువంటిదో తెలుసుకోవాలని అనిపించటం సహజం, వీరబ్రహ్మేంద్ర మిషన్, రామకృష్ణ మిషన్ లాగా విశ్వవ్యాప్తి నొంది వర్ధిల్లాలని ఆకాంక్షించారు 'ముందుమాట' రాసిన కొండూరు వీరరాఘవాచార్య.

'తాను ప్రకృతాంబ, పరిపూర్ణాచార్యులకు జన్మించి, కందిమల్లెయపల్లెలో వీరబ్రహ్మేంద్రస్వాములుగా అవతారోద్దేశ్యం నెరవేర్చిన చివర జీవసమాధి నిష్ఠ వహిస్తాననాడట' విష్ణువు, బ్రహ్మదేవునీ శివునీ ఉచితాసనాల్లో కూర్చుండ బెట్టాక ! బ్రహ్మదేవుని బ్రాహ్మణ కులంలో అన్నాజయ్యగాను, శంకరుని మొదట క్షత్రియకులంలో ఆనంద భైరవునిగాను, ఆ తర్వాత ముస్లిం కులంలో సయ్యద్ సాహెబ్‌గాను జన్మించి, సిద్ధయ్యపేరుతో తనకు శిష్యుడు అవమన్నాడట .... ఈ విధంగా సాగుతుంది బ్రహ్మంగారి జీవితచరిత్ర.

శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారు ఉత్తర ప్రదేశ్‌లో కాశీ ప్రాంతమందు, సరస్వతీ నదీతీరాన జన్మించారనీ, బాల్యం కర్ణాటకలోని పాపఘ్ని మఠంలో గడిచిందనీ, ఆ తర్వాత బనగాని పల్లెలో కొన్ని సంవత్సరాలు తపస్సు చేసి, కావేరీ తీరాన రంగనాథ స్వామిని సేవించి, కడపజిల్లా కంది మల్లయపల్లెలో జీవసమాధి పొందినట్లు, వారి జీవితకాలం 1608 నుంచి 1693 వరకు అయినట్లూ చరిత్రకారులు నిర్ణయించారని ఈ రచయిత చెబుతున్నారు 53 వపేజీలో.

బ్రహ్మంగారి 'కాలజ్ఞానం' లోక ప్రసిద్ధం. అందులో భవిష్యద్వాణి

ఉన్నదని కొందరు నమ్మినా, అందరూ నమ్మలేరు. 'ఏకు' పట్టిన వాడు 'మేకు' అయి, స్వరాజ్యం తెస్తాడని ఆయన చెప్పారట ! రాట్నచక్రం సుదర్శన చక్రాన్ని పోలినదట. ఇవన్నీ కల్పనా చాతుర్యాలే తప్ప హేతుజ్ఞానానికి లొంగల్స నొస్ట్రాడమస్ (Nostradamus - 1503 - 1566) అనే ఫ్రెంచి యస్ట్రాలజర్ మానవ భవితవ్యమంతా 'సింబాలిక్ రైమ్డ్ ప్రెడిక్షన్స్'లో ('Symbolic rhymed predictions) చెప్పాడు - మేధావులని సైతం కొన్ని విస్మయ పరుస్తూ వుంటాయి. అంతమాత్రాన ఆ సంకేతాలు వాస్తవికాలుగా గుర్తింపు నొందవు.

సమతా మమతలు సంస్థాపించిన మానవతామూర్తిగా, సంఘ సంస్కర్తగా, సద్గురువుగా బ్రహ్మంగారి స్థానం పూజనీయమైనది - ఆయన ఒక మహర్షి - మహానుభావుడు.

—క్షీరసాగరమ్

*

## ఈ మధ్య అందినవి :

మాట కచ్చేరీ - హాస్య రచనల సంకలనం, తురగా కృష్ణ మోహన రావు. ప్రత్యూష ప్రచురణలు, హైదరాబాదు - 27 .... రు. 25-00.

తెలుగు కథ. సంకలన కర్త : డి రామలింగం, సాహిత్య అకాడెమీ న్యూఢిల్లీ - 1 .... రు. 40-00.

నవ్వనిపువ్వు - కథలు. తురగా జానకీరాణి. ప్రత్యూష ప్రచురణలు, హైదరాబాదు 27 .... రు. 20-00

శబ్దార్థ ప్రపంచం. ఆర్ సి ఆర్ ఆలపాటి. అంబికా ప్రొడక్ట్స్, ఏలూరు - 2 .... వెల : అమూల్యం.

మాండూక్యోపనిషత్తు - మండ చిన్న రామమూర్తి. రామ్‌నగరం శ్రీకాకుళం జిల్లా .... మూల్యం : ఆనందం.

వస్తువులు - సముద్రాలు. కొండల రావు వెలిచాల. వివేకానంద పబ్లికేషన్స్, హైదరాబాదు.... రు. 10-00.

'Stray Thoughts' by Mallemaala - 47 Film Nagar, Hyderabad - 34.

'Word Fire' - Acharya Tirumala - Aksharaagni in Telugu - English Translation by Santi Swaroop . . Rs. 20/-

'Gloating Grass' Dr. V. Malakonda Reddy - English Translation of Telugu Thoughts by Santi Swarup . . Rs. 10/-

'The Mirror of Time' - Acharya Tirumala - English Translation by S T V Raghavacharya, Rs. 25/- ... Vipla Publications, Hyderabad - 29.

కనక ధారా స్తవము - బూరుల రామకృష్ణరావు పద్యానువాదం. పింగళి - కాటూరి సాహిత్యపీఠం, హైదరాబాదు - 29 .... రు. 4-00.

అందుకున్నవన్నీ గాకపోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి.

# డైరీ

డిసెంబరు 08, 1988

'అభినయము'లో విశిష్టురాలైన పద్మశ్రీ కళానిధి నారాయణన్ (డైరక్టర్: 'అభినయసుధ' - 2, పన్నెండవ క్రాస్‌స్ట్రీట్, శాస్త్రినగర్, మద్రాసు - 600 020), ఒక వారంరోజుల పాటు నృత్య సంబంధితమైన సెమినార్, డిసెంబరు 8వ తేదీ నుంచి 13 దాకా, మండవల్లిలోని నారాయణి కళ్యాణమండపంలో నిర్వహిస్తున్నారు. దేశదేశాలలోని అమె స్టూడెంట్స్ - ముఖ్యంగా కెనడా, అమెరికా, గ్రీసు, ఫ్రాన్సు మున్నగు దేశాలలోనివారు - వివిధ సంస్కృతులకు చెందినవారు, ఇండియన్ స్టూడెంట్స్‌తోబాటు, ఈ నాట్య గోష్టి ఉత్సవంలో పాల్గొంటున్నారు. ఉదయం పూట డిమానస్ట్రేషన్ లెక్చర్లూ, సాయింత్రం నాట్య ప్రదర్శనలు, భరతనాట్యం, కథక్, కూచిపూడి, మోహిని ఆట్టమ్, ఒడిస్సీ - ఈ రీతులు వేరైనా భారతీయ నాట్య సంప్రదాయంలోని మూలసూత్రం ఒక్కటే! నాట్యవిద్య తెలిసినవారూ తెలియనివారూ ఆ మెళకువలూ, పద్ధతులూ తెలుసుకోవడం ద్వారానే నాట్యకళను ఆనందించ గలుగుతారు; కళాకారిణి చూపే విద్యా కౌశలాన్ని మెచ్చుకో గలుగుతారు. .... టి.ముక్తఅమ్మాళ్ ఈ సెమినార్‌కి ప్రారంభోత్సవం గావించారు. ఆ తర్వాత పసుమర్తి కృష్ణమూర్తి భరతనాట్యము, కూచిపూడిలలోని అంగాంగ విన్యాస వైవిధ్యం చేసి చూపించి, (వలపు వాడక ముందే రారా నాసామి!) స్థూలాభినయము, సూక్ష్మాభినయము ఏ విధంగా తెలుసుకోవచ్చో వివరించారు. నాట్యరీతుల వివరణని ప్రేక్షకులు హర్షాతిరేకంతో తిలకించారు.... ఆ తర్వాత 'బన్నిబాయ్' సభారంజనతో హరికథ డిమాన్‌స్ట్రేషన్ ఆరంభించారు. చక్కటి వాక్చాతుర్యమూ, మాంఛి పాండిత్య జ్ఞానమూగల ఈ పన్నీరుబాయి ('ఫణి' పన్నీరుబాయి అయిందట) ఎంతసేపైనా సభికుల్ని తన వచోధారలతో కట్టేయగలరు. .... ఒక్కోసారి వాచీవంక చూడకూడదనిపిస్తుంది - కాని, చూడక

తప్పదు. ముందుకి అడుగుపడుతున్న కొద్దీ టైము మీద ఒత్తిడి పెరుగుతుంది. మిత్రులు వి ఎ కె రంగారావు ప్రసంగం వినకుండా బయలుదేరడం హితవుగా లేకపోయినా, తప్పలేదు.

. . . . . 13

సులోచనా ముత్తురామన్ కుమారుడైన సినీహీరో చి॥ కార్తిక్ సౌ॥ జయకుమారిల (రాగిణి) వివాహ సందర్భంగా సాయింత్రం ఆరుగంటలకు విజయాశేష్‌మహల్‌లో రిసెప్షన్; శంకర్ - గణేష్ మ్యూజిక్. పత్రికల వారిని ప్రత్యేకంగా కలుసుకునేందుకు మధ్యాహ్నం లంచ్ ఏర్పాటు చేశారు. కార్తిక్ అందరినీ పల్కరించి, స్వల్ప వ్యవధిలో తన ఆహ్వానం మన్నించి వచ్చిన పాత్రికేయులకు కృతజ్ఞత తెలిపారు. నవదంపతులకు మా శుభాభివందనలు. .... పి ఆర్ ఒ; ఫిలిమ్‌న్యూస్ ఆనందన్.

. . . . . 15

డిసెంబరు పదిహేను అనగా విజ్‌డమ్ పండగ - ఇది పదహారో సంవత్సరం పండగ. వ్యాపార ప్రకటనలు లేకుండా, సినిమావార్తలూ సెన్సేషనలిజమూ లేకుండా, ఆరోగ్య దాయకమైన సంగతులతో, అన్ని వయసుల వారినీ ఆకట్టుకొనే పద్ధతితో, విద్యా వినయ వివేకాలు పెంపొందించే ఔషధ గుళికలా, ప్రతినెలా సుమారు లక్షన్నర కాపీలు ముద్రిస్తూ, ఇరవై లక్షలమంది చేతుల్లోకి వెళ్తున్న ఈ 'విజ్‌డమ్' పత్రిక, 'ఇండియన్ పిరియాడికల్ ప్రెస్'లో ఒక మాణిక్యమని చెప్పవచ్చు. అందుకుగాను ఎడిటర్ కెవి గోవిందరావు, ఆయన కుమారులూ కుటుంబమూ అభినందనీయులు..... రాణిసీతయ్ హాలులోని ఈనాటి సభకు జస్టిస్ వెంకటస్వామి అధ్యక్షత వహించగా, పాండిచ్చేరి యూనివర్సిటీ వైస్ - ఛాన్సలర్ వెంకట సుబ్రహ్మణ్యం 'విజ్‌డమ్' (ఇంగ్లీషు) 16వ వార్షికోత్సవ సంచికను విడుదలచేశారు. యమ్ జి ఆర్ మెడికల్ యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ లలితా కామేశ్వరన్ 'విజ్‌డమ్' (తెలుగు) 7వ వార్షికోత్సవ సంచికను విడుదల చేశారు. లయన్ యన్సి కృష్ణన్, (324 - ఎ - డిస్ట్రిక్ట్ గవర్నరు), ఆంధ్రా ఛాంబర్ అధ్యక్షులు మోహన్‌రావు అవార్డు గ్రహీతలను అభినందించారు - వేర్వేరు రంగాలలో గుర్తింపు పొందిన నలభైనలుగురుని! .... "మొట్టమొదట ఈజిప్షనులూ, తర్వాత రోమనులూ వార్తా వ్యాప్తిలోని ప్రాముఖ్యాన్ని, సమాచారం నలుమూలలకీ వ్యాప్తి చేయడంలోని ఆవశ్యకతనీ గుర్తించారు .... ఆధునిక కాలంలో డేనియల్ డిఫో 1704 లో మొట్టమొదటి పత్రిక ప్రారంభించాడు. - 18వ శతాబ్దంలో అనేక పత్రికలు జనించాయి - ప్రింటింగ్ సౌకర్యం వృద్ధి జెందడంతో! భావస్వాతంత్ర్యంతోబాటే నూతన శకోదయం జరిగింది. Press is a Public Trust - not a private business.

మంచి సంగతులకు బహుళప్రచారం కలిగించాలనే ధ్యేయం వుండటంవల్లనే 'విజ్‌డమ్' ని యింతమంది పాఠకులు అభిమానిస్తున్నారు, ఆదరిస్తున్నారు'' - అని చెప్పారు సభాధ్యక్షులు జస్టిస్ వెంకటస్వామి ... ''Knowledge is Power అని ప్రాచీనులు చెప్పినది వివేకానందులు మనకి మళ్లీ గుర్తు చేశారు. గన్నార్ మిర్డాల్ 'ఏషియన్ డ్రామా' లో ఇక్కడి ప్రజలలో ఉన్నది ముఖ్యంగా సోమరితనం అని నిస్సంకోచంగా చెప్పాడు. పైకి ఎక్కడం గాక, ఎక్కిన వారినీ ఎక్కుతున్న వారినీ కిందకి లాగేందుకే మన సర్వ శక్తులూ వినియోగిస్తాము - అదే మన సరదా, అదే మన వ్యాపకం. ఎవరి దారిని వారిని వెళ్లనివ్వము ; అటకాయించడమూ అడ్డు తగలడమూ ఘన కార్యంగా భావించి, ఎంతటి సత్ప్రయత్నంలోనూ మాలిన్యమే వెతుకుతాం. ఆ విధ్వంస దృక్పథం నుంచి మన మనస్తత్వాన్ని మార్చుకుంటే తప్ప పురోగమనమంటూ ఉండదు .... కలకత్తాలో పగలంతా జీవనోపాధికి కావల్సిన సామాన్యమైన ఉద్యోగం చేస్తూ, ఆరు గంటలకి యింటికొచ్చాక ఆ ఆరునుంచి అర్ధరాత్రిదాకా, తన యింట్లోని చిన్నగదిలో పదిహేడేళ్ల పాటు పరిశోధన జరిపి, నోబెల్ బహుమతి పొందాడు సి వి రామన్. ఈనాడు ఆ ఏకాగ్రత, అటువంటి దీక్ష ఎందువల్ల లోపిస్తున్నాయి? - మనలోని సోమరితనం కాదా?'' - అని ప్రశ్నించారు వైస్ ఛాన్సలర్ వెంకట సుబ్రమణియన్. ఆ సోమరితనం పోగొట్టేందుకు 'విజ్‌డమ్' యితోధికంగా సాయపడగలదనే ఆశాభావం వెలిబుచ్చారాయన .... విషయానుక్రమణికవంటిది ఈ పత్రిక ఉపయోగాన్ని యినుమడింప జేస్తుందన్నారు లలితాకామేశ్వరన్. విజ్‌డమ్ యవార్డ్ గ్రహీతలు ; 1 ఉత్తమ డాక్టరు సి యస్ విజయశంకర్ ; 2 ఉత్తమనర్సు : ఆర్ విజయకుమారి. 3 పి అర్ ఒ ; కనక సభాపతి 4 ప్రజాహితైషి ; శాంతి శీలా నాయర్ ; 5 సంఘసేవ ; శామ్యుల్ ; 6 స్టేజి యాక్టర్ రుద్రపతి ; 7 నాటకరచయిత కె కె రామన్ ; 8 రంగస్థల నటి కుట్టి పద్మిని ; 9 అకవుంట్స్ పరీక్షలో భారత్ కృష్ణాశంకర్ ; 10 హాస్య నటుడు కృష్ణారావు ; 11 అంబులెన్స్ మెంబరు సూరియనారాయణ ; 12 దక్షిణ రైల్వే ఎసి డ్రయివర్ షణ్ముగసుందరం ; 13 స్కవుట్ సురేష్‌కుమార్ ; 14 గైడ్‌ప్రిన్సీ. 15 బస్ డ్రయివరు జయకుమార్ ; 16 బస్‌కండక్టర్ శెల్వరాజ్ ; 17 పోస్ట్ మాన్ షేమ్‌సుద్దీన్ ; 18 ఎయిర్ వింగ్‌కాడెట్ మణికాంతన్ ; 19 సెంట్రల్ బోర్ సెకండరీ ఎడ్యుకేషన్ పరీక్షలో హిస్టరీ సుందర్ ; 20 ఇంగ్లీషు ఫస్ట్ మంజుల ; 21 హయ్యర్ సెకండరీ కామర్స్ ఫస్ట్ శివశంకరి ; 22 మాథమెటిక్స్ ఫస్ట్ దీపా రమేష్ ; 23 'సార్క్' దేశాల లేఖారచనలో ఫస్ట్ రేణుక ; 24 జాగ్రఫీలో స్టేట్ ఫస్ట్

షాకజ్ ఫతీమా ; 25 కెమిస్ట్రీ - వెంకటేష్ ; 26 అకవుంటెన్సీలో పద్మప్రియ ; 27 యస్సెల్సీలో తమిళంలో రమ ; 28 ఆంగ్ల ఇండియన్ స్కూలు తమిళంలో - మంజు డొమినిక్ ; 29 హిస్టరీ అండ్ జాగ్రఫిలో అమృతాదేవి ; 30 ఆంగ్లో - ఇండియన్ స్కూలు ఇంగ్లీషులో కృపా ఛేరీల్ ; 31 అడ్వాన్ ఇంగ్లీషులో కల్పన ; 32 మెట్రిక్యులేషన్ హిందీలో ఆరతి ; 33 ఆంగ్లో ఇండియన్ స్కూలు - మొనాగోపాల్ దాస్ ; 34 మెట్రిక్యులేషన్ మాథమెటిక్స్ సెలిస్టర్ విజయ్ ; 35 సైన్సులో సీతారామ్ ; 36 సంస్కృతంలో భవాని ; 37 మెట్రిక్యులేషన్ సైన్సులో లత ; 38 యస్సెల్సీ మాథమెటిక్స్‌లో ప్రిన్సీ ; 39 సైన్సులో రమేష్ ; 40 హిందీలో స్టేట్‌ఫస్ట్ రాధిక ; 41 హాండ్‌కాప్డ్ బ్రిలియంట్ అమ్మాయిలలో ఉష ; 42 అబ్బాయిలలో సతీష్‌కుమార్ ; 43 బధిరులలో బ్రిలియంట్ అమ్మాయి టిట్టీ జోస్ ; 44 అబ్బాయి సూరజ్ సాక్సేనా. ఈ నలభై నలుగురికే గాక మరొక ఇరవై పాతిక మందికి జ్ఞాపికలు, బహుమతులు అందజేశారు. ఎవరి ఉపన్యాసమూ ఏడెనిమిది నిముషాలు మించకుండా, ఇందరి స్పీచెస్సూ, ఇంత మందికి బహుమతి ప్రదానమూ మొత్తం కార్యక్రమమంతా, టంచన్‌గా ఆరుగంటలకు ఆరంభమై ఏడూ ఇరవైకి ముగిసింది. టైముని ఎంత పొదుపుగా వాడాలో, వాడుకోవాలో తెలిసిన విజ్‌డమ్‌వారి విజ్‌డమ్ అభినందనీయం.

. . . . . 16

'చుక్కల పల్లకిలో - చూపుల అల్లికలో - పలికెను కళ్యాణ గీతం - మలయ సమీరంలో' (సినారె సాంగ్ - బాలు, సుశీలల గాత్రం) నాయికా నాయకులు (రాధ - చిరంజీవి) తమ ప్రణయాను రక్తికి పంచమ స్వరం పలుకుతారు - మహేశ్వరీ పరమేశ్వరీ వారి 'స్టేట్ రౌడీ' లో. పేరు ప్రమాద భరితంగా ఉన్నప్పటికీ ఈ 'రౌడీ' చాలామంచి రౌడీ అని చెప్పారు - 'పల్లవీ' లో (హొటల్ సవేరా) పాటల ప్రదర్శనానంతరం నిర్మాత సుబ్బరామిరెడ్డి. రెండవ నిర్మాత శశి భూషణ్, పత్రికా సమావేశ నిర్వహణని పూర్తిగా సుబ్బరామిరెడ్డికి వొదిలేశారు. ఈ సాయింత్రం ముఖ్య అతిధి ప్రఖ్యాత సంగీత దర్శకులు బప్పీలహరి. చిరంజీవి ఈ చిత్రంలో చూపిన నాట్య ప్రదర్శన ఎంత ప్రతిభావంతంగా ఉన్నదో, డాన్స్ ద్వారా సినీ రంగ ప్రవేశం గావించిన కమలహాసన్ మెచ్చుకున్నారు. ఇద్దరు మా టి నీ హీరోలూ సభా మర్యాద కోసం రెండేసి ముక్కలు చెప్పి, మధ్యలో ఆపి రావడం వల్ల, తమ షూటింగ్ కార్యక్రమానికి వెళ్లిపోయారు. గోపాల్ దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రానికి కధ - మాటలు సమకూర్చినది పరుచూరి బ్రదర్స్. పాటలు : వేటూరి, సినారె, జొన్నవిత్తుల.... 'ఇది స్పీడు యుగం నేటి స్పీడుకి అనుగుణంగానే యిందులోని పాటలూ, సన్నివేశాలూ సమస్తం సమకూర్చాము. బప్పీలహరి సంగీతం ఎంత చైతన్యపూరితంగా ఉందో మీరు పాటలలో చూశారు గదా' - అన్నారు సుబ్బరామిరెడ్డి, సవేరా కాన్ఫరెన్స్ హాలులో. ఈ సందర్భంగా కావేరీ కాసెట్స్‌వారు ఈ చిత్రంలోని పాటల కాసెట్ రిలీజ్ చేశారు.... చిరంజీవి, రాధలతోబాటు, భానుప్రియ, శారద, రావుగోపాలరావు, సత్యనారాయణ, జగయ్య, అల్లు రామలింగయ్య, నూతన్‌ప్రసాద్, త్యాగరాజన్, సుధాకర్, హరిప్రసాద్, నిర్మల, అన్నపూర్ణ మున్నగువారున్నారు.

. . . . . 18

గత 62 ఏళ్లుగా తన పాట కచ్చేరీలతో శ్రోతలను సంగీత రసాంబుధిలో మునకలు వేయిస్తున్న శెమ్మంగుడి శతాభిషేక మివ్వాళ శ్రీకృష్ణగాన సభలో! మహారాజపురం విశ్వనాధ అయ్యర్ ప్రియశిష్యుడైన శెమ్మంగుడి శ్రీనివాసయ్యర్, గురువు చూపిన మార్గం వెంట పయనిస్తూనే తనదైన ప్రత్యేక వరవడి ఈ శతాబ్ది ముప్ఫయిల నాటికే అలవరుచుకు, అప్పట్నుంచి యిప్పటిదాకా, ఈ 81వ ఏట, గంటన్నర ఉపన్యాసాల తర్వాత, సుమారు రెండున్నర గంటల సేపు జరిపిన పాటకచ్చేరీ దాకా, శ్రోతల నాయన ఆనంద డోలికల వూగిస్తూనే ఉన్నారు. 'మాకు ఒక గంట అయాక అలసట వస్తుంది - ఈయనకు ఒక గంట అయాక మరింత ఉత్సాహం వస్తుంది' - అని లాల్‌గుడి జయరామన్ చెప్పిన మాటలు

అక్షరాలా నిజం. ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రం ఏభై ఏళ్ల క్రితం శెమ్మంగుడి పాటతో ప్రారంభ మయింది ; 1988 జూన్ 16వ తేదీన మ్యూజిక్ అకాడమీలో ఆకాశ వాణి స్వర్ణోత్సవం జరిగినప్పుడు మళ్లీ ఆ శెమ్మంగుడే గానం చేశారు.... శతాభిషేకమనగా 81 ఏళ్లు వచ్చాక, శతాయుష్షువి గమ్మని బంధుమిత్రులూ వేద పండితులూ జరిపే ఉత్సవం.... శ్రీకృష్ణగాన సభ అధ్యక్షులు బివి యస్సెస్ మణి ఆహూతులకు స్వాగతం తెలిపాక, పీఠాధిపతుల ఆశీర్వచనం తర్వాత, పారిశ్రామికవేత్త ఓబుల్ రెడ్డి. ఎవియమ్ తయారుచేసిన శెమ్మంగుడి కాసెట్ రిలీజ్ చేసి మొదటి కాసెట్ మహారాణి లక్ష్మీబాయికి (తిరువాన్కూర్) సమర్పించారు. "శెమ్మంగుడి గానానికి ముగ్ధులు గాని వారెవరు? తిరువనంతపురంలోని సంగీతకళాశాల ఆయన పర్యవేక్షణలో ఎంతో అభివృద్ధి చెందింది. కర్ణాటకసంగీతానికి అఖండ గౌరవం తెచ్చిన కళానిధి ఆయన" - అన్నారు మహారాణి లక్ష్మీబాయి తన ఉపన్యాసంలో. ".... స్వాతి తిరునాళ్ రచనలకు 'నొటేషన్'







సమకూర్చారు శెమ్మంగుడి ఆలిండియా రేడియోలో ఉన్న రోజులలో - అది ఒక అద్వితీయమైన కృషి. నేనప్పట్లో కేంద్రంలో ఇన్ఫర్మేషన్ మినిస్టర్గా ఉంటుండేవాణ్ణి.... ఆయన తిరువాన్కూర్ మ్యూజిక్ కా లే జీ లో పన్నెండేళ్లు ఉన్నారు.... త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితార్, స్వాతి తిరునాళ్ - వీరు వొదిలి వెళ్లిన సంగీత సంప్రదాయం ఏ రాష్ట్రానికి ఏ ప్రాంతానికీ చెందినది కాదు. అది దక్షిణా పథానికీ, యావద్భారతానికీ చెం ది న మ్యూజికల్ ట్రెడిషన్. సంప్రదాయ మనేది చెట్టుకుండే వేరు లాటిది. చెట్టు వేళ్లు భూమిలో పాతుకొని వుంటాయి; కాని, చెట్టు శాఖోపశాఖలుగా విస్తరిస్తుంది. ఆ విస్తరించే శాఖలనే నవీనత అనీ ఆధునికత అనీ అంటాము. శెమ్మంగుడిలో మనకు వేళ్లతో బాటు శాఖలు కూడా కనిపిస్తాయి - అదే ఆయనలోని గొప్పతనం" - అన్నారు బెజవాడ గోపాలరెడ్డి.... 'రామ నీ సమానమెవరు....' 'నను కన్నతల్లి...' 'రామజోగి మందు కొనరె....' వంటి గాన సుధా చంద్రికలతో శ్రోతలను రసానంద లోకాన విహరింపజేశారు శెమ్మంగుడి.

. . . . . 19

మాస్ మీడియా ఫౌండేషన్ ఆఫ్ ఇండియా, ఫిలిమ్ ప్రొడ్యూసర్స్ గిల్డ్ ఆఫ్ సౌత్ ఇండియా, సినీ టెక్నీషియన్స్ అసోసియేషన్ ఆఫ్ సౌత్ ఇండియా, పుడొవ్కిన్ ఫిలిమ్ క్లబ్ (Mass Media Foundation of India, - Film Producers Guild of South India, - Cine Technicians Association of South India - Pudovkin Film Club) ఈ నలుగురూ కలిసి, భారత దేశంలో పర్యటిస్తూ మద్రాసు వచ్చిన సోవియట్ ఫిలిమ్ ప్రతినిధి వర్గం (Soviet Film Delegation) గౌరవార్థం సోవియట్ కల్చరల్ సెంటర్ లో సమావేశం ఏర్పాటు చేశారు. పుడొవ్కిన్ పిలిమ్ క్లబ్ కార్యదర్శి శాంతారాజ్ స్వాగత వచనానంతరం, పదహారుగురు ప్రతినిధులకి పేరు పేరున మాలలు వేశారు. ఆ విధంగా వారేమిటో, ఏ రంగంలో కృషి చేస్తున్నారో సభకు పరిచయమయారు. లీడర్ ఆఫ్ ది డెలిగేషన్ ఒక అందమైన వనిత - ఆమె ప్రఖ్యాత నటి, ప్రముఖ దర్శకురాలూనట. తన సమాధానంతో ఆమె నికొలాస్ రోరిచ్ని (పెయింటర్) ఉదహరిస్తూ, ఇండో - సోవియట్ ఫ్రెండ్షిప్లోని కళాత్మక విలువలు అంత పటుతరమైనవి - అన్నారు.. సభా ప్రారంభాన ఆర్మీనియా భూకంపంలో మృతులైన వారికోసం ఒక నిముషం సేపు నిలబడి మౌనం పాటించారు.... "1919 లో జలియన్ వాలా బాగ్ దురంతాలకు సానుభూతి సందేశం పంపాడు లెనిన్. అప్పట్నుంచీ మన మైత్రీ బంధం మరింత గట్టిపడింది. స్వాతంత్ర్యానికి పూర్వమూ, స్వాతంత్ర్యం వచ్చాక, మనకష్ట నిష్ఠూరాలలో మనకి అండగా నిలబడి ఆదుకుంటున్న దేశం సోవి

"ధైర్యంగా ఉండు మిగిలినవన్నీ
వాటంతటవే వస్తాయి"

జవహర్‌లాల్ నెహ్రూ

1930 అక్టోబరు 26వ తేదీన జవహర్‌లాల్ నెహ్రూ
తమ కుమార్తె ఇందిరా ప్రియదర్శినికి వ్రాసిన
లేఖలోని మాటలివి

జవహర్‌లాల్ నెహ్రూ శతాబ్దిని జరుపుకుంటూన్న
ఈ సంవత్సరపు రిపబ్లిక్ దినమైన ఈ రోజున
వారి మాటలతో బాటుగా తమ క్షేమాన్ని ఏమాత్రం
లెక్క చెయ్యకుండా సేవా ధర్మాన్నే లక్ష్యంగా
పెట్టుకొని దానికి తగ్గట్టుగా జీవిస్తూ అసాధారణ
ధైర్యాన్ని ప్రదర్శించిన ఆ సాహస బాలలందరినీ
మనం గుర్తుకు తెచ్చుకుందాం



davp 88 619 TEL

యట్ యూనియన్. వారికీ మనకీ అన్ని రంగాలలోను ఎన్నో సామ్యాలూ సామీప్యతలూ వున్నాయి'' - అన్నారు, యస్ కృష్ణస్వామి. మూడుసార్లు రష్యా వెళ్లి వచ్చిన ప్రొడ్యూసర్స్ గిల్డ్ రామ్మూర్తి, ఫిలిమ్ నిర్మాణంలో, ముఖ్యంగా డాక్యుమెంటరీ నిర్మాణంలో సోవియట్లు ఎంత ప్రగతి సాధించినదీ తెలిపారు. సొలొడొవ్ (సోవియట్ కల్చరల్ సెంటర్), శ్రీవిద్య మున్నగువారు ప్రసంగించిన మీదట 'సిటిపి' అధ్యక్షులు కెజె మోహన్ వందన సమర్పణ గావించారు..... వసంత లక్ష్మీ నరసింహాచార్యుల విద్యార్థినులైన లత, గీత ప్రతినిధి వర్గ సభ్యులు అచ్చెరువొందే రీతిని నాట్య విద్య ప్రదర్శించారు. సుశిక్షణ పొందిన ఈ చిరంజీవులిద్దరూ మోహనా కృష్ణస్వామి దంపతుల పిల్లలు - లత, గీత యిరువురూ మణిపూసలు.

. . . . . 21

కేతిరెడ్డి విద్యాపీఠం వారి (మేనేజింగ్ ట్రస్టీ: హరిప్రసాదరెడ్డి) ద్వితీయ వార్షిక సాహితీ మహోత్సవం, వరల్డ్ పొయిట్రీ సొసైటీ (ప్రపంచ కవితా సమాఖ్య) అధ్యక్షులు కృష్ణా శ్రీనివాస్ సభాధ్యక్షులుగా, మద్రాసు గవర్నరు సలహాదారు పద్మనాభన్ ముఖ్య అతిథిగా ఫిలిమ్ ఛాంబర్‌లో.... బాంకాక్‌లో ఈ మధ్య జరిగిన ప్రపంచ కవుల కాంగ్రెస్‌లో పాల్గొని వచ్చిన తెలుగు కవుల కవితాగానం ఈ రోజున.... బాంకాక్‌లోది పదవ సమావేశం - పదకొండోది రెండేళ్ల తర్వాత కెయిరో నగరంలో.... వేగుజుక్కలు కలుసుకున్న ఈ విశ్వకవి సమ్మేళనం గురించి మల్లెమాల లోగడ మద్రాసులోని పత్రికలవారికి చెప్పి వున్నారు - ఆ వివరాలు యించుమించు అన్ని పత్రికలలోనూ వచ్చాయి .... ఆ శృంగార విపణిలో ఒక్క 'అమ్మ' తప్ప ఏదైనా సరే వెలకు దొరుకుతుంది; ఎమరాల్డ్ బుద్ధుని చూసేందుకు రెండు కళ్లు చాలవు, వెయ్యి కళ్లు కావాలి - అన్నారు. వెండితెర రూప, ముఖ్యులను వేదిక మీదకు ఆహ్వానించారు; హరిప్రసాదరెడ్డి పుష్పమాలలు వేశారు. బాపురెడ్డి, మల్లెమాల, వుండేల మాలకొండారెడ్డి, ఆచార్య తిరుమల, తెలుగు అకాడమీ కొండలరావు కవితాగానం చేశారు. ప్రతి ఒక్కరూ బాంకాక్ నగరంలో తాము వ్యక్తిగతంగాను సమావేశ సందర్భంగాను పొందిన స్పందనని, తమదైన కవితా వాక్కుతో వరవడితో చెప్పారు. అక్కడ అయోధ్య, శ్రీరాముడు, సుప్రియ (నది) కనిపించారని ఒకరంటే, ప్రతియింటి ముంగిటా బౌద్ధం కనిపించిందని మరొకరు అన్నారు. అయితే అందరినీ ఆకర్షించినది అక్కడి తరుణీమణుల లావణ్య కాంతులు, ఏభై దేశాల నుంచి వచ్చిన మూడువందల మంది ప్రతినిధుల పాల్గొన్న ఈ కవితా సదస్సులో తెలుగుపలుకుకి, తెలుగు పాటకి వినూత్న గౌరవం తెచ్చి, భాష తెలియని వారిని సైతం తన గళంతో, శ్రావ్యగానంతో మెప్పించిన మల్లెమాల

అభినందనీయులు.... ప్రాక్ పశ్చిమ సంగమమైన బాంకాక్ నగరానికి ఈ కవులందరూ తమ తెలుగు కవితల ఆంగ్లానువాదాలు అందంగా ముద్రింపించి తీసుకువెళ్లారు - ఎంచేతనంటే, అక్కడ చదవవలసినది యింగ్లీషులోనే గనక.... ఇది ఒక విధంగా శుభపరిణామం. మనం మన భాషలో ఎంత అందంగా చెప్పినా, మన భాష ఘనతని వేనోళ్ల పొగిడినా, శంఖులో పోస్తేగాని తీర్థం కానట్లు, ఇంగ్లీషులో చెబితేగాని బయట ప్రపంచాన గుర్తింపురాదు.... ఇంటి నుంచి బయలుదేరుతున్నప్పుడు గోపాలరెడ్డిగారు చెప్పారు: మనం ఎనిమిది అవగానే లేవాలని! సయ్యద్ అమీరుద్దీన్ (ఇంగ్లీషు ప్రొఫెసరు - న్యూకాలేజీ, మద్రాసు) ఆంగ్ల ప్రసంగం జరుగుతూండగా ఎనిమిదీ అయిదుకి గోపాలరెడ్డిగారు సీటులో నుంచి లేచారు; నేను ఆయన్ని అనుసరించవలసి వచ్చింది... కవితలు, ప్రసంగాలు యింకా వుండి వుంటాయి.... ఏ సభ అయినా, సమావేశమయినా అనుకున్న నిముషాన ప్రారంభించి, రెండు గంటల వ్యవధిలో ముగిస్తేనే రాణిస్తుంది - లేకపోతే, మొహమాటస్థులు చివరంటా వున్నా, వచ్చినవారు ఒక రొక్కరే జారుకుంటారు.

యన్నార్ చందూర్

卐

## ముఖచిత్రం

తూర్పుగోదావరి జిల్లా కపిలేశ్వరపురం గ్రామంలో పట్టాభి రామారావు సోదరులచే స్థాపించబడిన సర్వారాయ సంస్కృతి పాఠశాలలో, హరికథా కళాప్రక్రియలో సుశిక్షణ పొంది, దేశంలోని అనేక ముఖ్య పట్టణాలలో హరికథాగానం చేసి, రసజ్ఞుల ప్రశంస పొందడమే గాక, మూడేళ్లక్రితం ఉజ్జయినీ నగరంలో జరిగిన అఖిల భారత కాళిదాస సభలో బహుమతి పొందిన ఉమామహేశ్వరి, ఆంధ్రకళా సరస్వతి ప్రియతనయ, సంస్కృత భాషలో హరికథ చెప్పి, సభికులని మెప్పించడం సామాన్యమైన విషయంకాదు. అయితే 1988 డిసెంబరు 30 వ తేదీ మధ్యాహ్నం జర్మన్ హాలులో ('ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీ') 'కుమార సంభవం', 31వ తేదీ ఉదయం మ్యూజిక్ అకాడమీలో 'ఆదిశంకరాచార్య' - రెండూ విన్నవారు ఈ తెలుగు వనిత ఎంతటి ప్రతిభాశాలినో స్వయంగా తెలుసుకు ఆనందించారు..... సంస్కృతం దేవ భాష, జీవ భాషకూడా! ఆ సంస్కృత భాష ద్వారా, దేశసమగ్రతకి, సమైక్యతకీ ఉపయోగపడే విధంగా ఉమామహేశ్వరి చెబుతున్న 'హరికథ' చిరుతలు మోగగా, పదములు నర్తించగా, శ్రావ్యగానంతో, హావభావ సమ్మిళితమై రసానంద లహరిలో విహరింపజేస్తుంది. ✸